



# శ్రీ శివ సహస్రనామ స్తోత్రవివరణము

## శ్రీ ఇంద్రాక్షీ స్తోత్ర సహితం

(శ్రీ మన్మహాభారతే అను శాసనికపర్వణి)

-: సంకలన కర్త :-

బ్రహ్మశ్రీ రాంపల్లి శ్రీరామచంద్ర మూర్తిగారు

గాయత్రీ బాబా



----: ప్రచురణ :----

శ్రీ గాయత్రీ సాహిత్య విజ్ఞాన కేంద్రము

ఆర్యాపురం. రాజమండ్రి - 533 104

1989 వెల రు: 15-00

# ❋ విషయసూచిక ❋



....o₀o....

## -: దాతలు :-

1. శ్రీ నాళం రామారావుగారు, రాజమండ్రి
2. శ్రీ నార్కెడిమల్లి సుబ్రహ్మణ్యంగారు ,,
3. శ్రీ చవ్వాకుల ఉమామహేశ్వరావుగారు ,,
4. శ్రీ కొత్త విశ్వనాధముగారు కూనవరం
5. శ్రీ చిన్నారి జగ్గారావుగారు పార్వతీపురం
6. శ్రీ గంటా వెంకట్రాజుగారు సాలూరు
7. శ్రీ ఆకుల షణ్ముఖరావుగారు రాజమండ్రి
8. జె.వి.ఎస్. ప్రసాద్‌గారు (ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్) ,,
9. శ్రీ దత్తా వెంకటేశ్వరరావుగారు రాజమండ్రి
10. శ్రీ పొన్నాలక్ష్మీనరసింహంగారు, A.C.T.O. ,,
11. శ్రీ గ్రంధి ముత్యంగారు తాడేపల్లి గూడెం
12. శ్రీ ఎన్. సుబ్బారావుగారు (స్టేట్ బ్యాంక్) రాజమండ్రి
13. శ్రీ గోకవరపు అప్పలరాజుగారు విజయనగరం
14. శ్రీ మల్లా ఆనందరావుగారు పలాసా
15. శ్రీ యస్. సూర్యనారాయణశర్మగారు పలాసా
16. శ్రీ అందవరపు వరహా నరసింహము (వరం) మున్సిపల్ ఛైర్మన్, శ్రీకాకోళం.
17. శ్రీ వత్సవాయి జగపతి సత్యనారాయణవర్మగారు రామచంద్రపురం
8. శ్రీ వత్సవాయి సూరపురాజుగారు, రామచంద్రపుర,

## అభినందనము

మహాభారతాంతర్గతమైన శివసహస్రనామ స్తోత్రము మహిమప్రదమైనది. నిత్యపారాయణ గ్రంథము. "యద్విద్యయా కరోతి తద్వీర్యవత్తరం భవతి". మనము చేయు పూజ, స్తోత్రము, జపము మున్నగునవి తెలిసి చేసినచో మఱింత ఫలము నొసగును. సహస్ర నామములకు అర్థ వివరణము నిచ్చుట పారాయణ పరులకు ప్రయోజనకారి. శివపూజా విధానము, శివమాల స్తోత్రము, అర్ధనారీశ్వర, నిర్వాణషట్క, ఇంద్రాక్షీస్తోత్రాదులు ఈ గ్రంథమున చేర్చబడియుండుట ముచ్చట గూర్చుచున్నది. భక్తులకు, జిజ్ఞాసువులకు బహూపకారమైన ఈ ప్రచురణ కార్యము నిర్వహించిన "గాయత్రీబాబా" గారి సంకల్పము అభినందన పాత్రము. శ్రీ గాయత్రీ సాహిత్య విజ్ఞానకేంద్రము ఉత్తరోత్తరాభివృద్ధి నొంది ధార్మిక సేవ ఇతోధికముగా కావించునని ఆశించుచున్నాను.

లలితానగరం
రాజమండ్రి

కళాప్రపూర్ణ
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# అభిప్రాయం

శ్రీః

ఒక నెల్లాళ్లు హాయిగా కాశీవాసం చేసివచ్చిన యిల్లు చేరినవెంటనే మరునాడు - మా యింటికి అనేక రుద్రాక్షమాలలు ధరించిన ఒక వ్యక్తి కొన్ని అచ్చైన ఫారాలు తీసుకొని వచ్చారు. ఎవరైనా అచ్చైన ఫారాలతో వస్తే నాకు మహా భయం ! పుస్తకాలు వ్రాయటం, అచ్చువేయటం, అభిప్రాయాల వేటకు బయలుదేరటం, ఈ దేశంలో పరిపాటి.

ఆ మోక్షభూమినుంచి యిల్లు చేరుకున్నానో లేదో - మళ్ళీ యీ సంసారం మొదలైనదే ! అనిపించిన మాట వాస్తవం. ఉన్నమాట చెబుతున్నాను. దాపరికంలేదు.

"నేను ఏమిచెయ్యాలి ?"

"మీ అభిప్రాయం కావాలి ?"

"శివస్తుతులమీద ఒకరి అభిప్రాయం దేనికి ?"

"కాదు - మీరు వ్రాసితీరాలి !"

"ప్రయాణం బడలిక తీరలేదు. రెండు రోజులు ఆగాలి ! అని పంపించివేశాను.

"గాయత్రీ బాబా" పేరు విననివారు ఉండరు. అసలుపేరు శ్రీ గ్రంధి లింగమూర్తి. వైశ్యులు, పాలకొల్లు జన్మస్థలం. శ్రీ రామలింగేశ్వరునిలోని చివరి భాగమే ఈ "లింగమూర్తి" ఎంత దివ్యమైనపేరు ! కాని - ఈయనకు "గాయత్రీ బాబా"అన్న పేరే ప్రసిద్ధికి కారణమయినది.

ఈ లింగమూర్తి 9 సార్లు కాశీ సందర్శనం చేశారట ! 70 సార్లు శ్రీశైల మల్లికార్జునస్వామిని సేవించారట ! ప్రతి

యేడూ కార్తీక సోమవారంనాడు పంచారామయాత్రచేసి శివాభిషేకం చెయ్యటం ఈయన నియమాల్లో ఒకటి.

గాయత్రీ భక్తులు. శుక్రవారం దీక్షాదినం. కుంకుమ విభూతి తీర్థం మొదలైనవి యిస్తారు. కుబేరయంత్రం మత్స్యయంత్రం మొదలైనవి వేస్తారు. చాలా శిష్యవర్గం ఉన్నది.

అన్నింటికంటే నన్ను ఆయన ధరించిన రుద్రాక్షలే ఎంతగానో ఆకర్షించాయి. రుద్రమాలలు! నక్షత్ర మాలలు! వర్ణమాలలు! అష్టోత్తర శతమాలలు! చిన్నవీ పెద్దవీ – ఎన్నో రకాలు. ఒక్క ఏకముఖి తప్ప దాదాపు అన్నీ ఉన్నాయి. ఏకముఖి ఎవరికో యిచ్చివేశారట! వీనిలో కొన్నది ఒక్కటీ లేదట! అన్నీ ఎందరో మహానుభావులు ఇచ్చినవేనట!

శివలాంఛనధరుల్ని ఎవ్వరిని చూచినా, నాకు మనస్సు పొంగుతుంది. ధూర్జటిమాట గుర్తుకువచ్చి—

"భసితోద్ధూళన పాండురాంగులు జటాభారోత్తమాంగుల్ వసో
వ్యసనుల్ సాధిత పంచవర్ణ రసనుల్ వైరాగ్యవంతుల్ నితాం
త సుఖస్వాంతులు సత్యభాషణ సముద్యద్రత్న రుద్రాక్షి రా
జి సమేతుల్ దుదినెవ్వరైనఁ గొలుతున్ శ్రీకాళహస్తీశ్వరా!"

ఈ లింగమూర్తితో గోష్ఠి నాకు ఆనందం కలిగించింది. ఈయనకు ఎన్నో విషయాలు తెలుసు. తనకు ఏమీ తెలియదంటారు. ఈ రాజమహేంద్రవరంలో శ్రీ కన్యకా పరమేశ్వరికి గుడి ఎందుకు లేదో చెప్పారు.

ఈయన గాయత్రీ మంత్రాక్షర సంఖ్యను పురస్కరించుకొని 24 గ్రంథాలు ప్రచురించాలని సంకల్పించారు. ఇప్పటికి

20 పుస్తకాలు ప్రచురించారు. ప్రస్తుతం ఈ సంకలనంలో శివ సహస్రనామములు అర్ధ వివరణము శివ కవచము ఇంద్రాక్షీ స్తోత్రము శివకవచము శివాష్టోత్తర నామములు శివాపరాధ స్తోత్రము నిర్వాణాష్టకము మొదలైన శివస్తుతులుఉన్నాయి. దీనితో పాటు శ్రీ ఉమామహేశ్వర పూజా విధానము కూడా వేరే పుస్త కంగా ప్రచురించారు.

ఈయనకు సంస్కృతభాషా పరిచయం లేదు. పండితుల సాహాయ్యంతో ఈ సంకలనము ముద్రణము మొదలైన కార్య భారం అంతా నిర్వహిస్తున్నట్లు తోస్తున్నది. కాబట్టి దీనిలోని గుణదోషాలతో ఈయనకు ప్రసక్తిలేదు.

ఒక్క శివభక్తి ఎన్ని దోషాలనైనా ఉపశమింపం జేస్తుంది. అది యీయనకు నైసర్గికమని యీయనను చూచిన వారి కెవరికైనా తోచితీరుతుంది.

ఈ శివస్తుతి సంకలనం జగత్కల్మష క్షాళనమునకు సాక్షాత్తు గంగానదియే!

శివసంకల్పమువలన యీయన యుద్యమము శివమయము కాగలదని ఆశింతును.

సర్వం శివమ్.

మల్లయ్యపేట
3-11-88

మల్లంపల్లి శరభేశ్వరశర్మ
విభవ ఆశ్వయుజ బహుళ దశమీ బుధవారము

# విజ్ఞప్తి

స్వర్గీయ పోడూరి రాజారావు సత్యయుగపు మనీషి. ముఖ్యముగా నిరాడంబరులు స్వార్ధ రహితులు. సౌమ్యులునైన నాగరాజారావుగారు నాచేత వ్యాసవిరచితమైన సంస్కృత మహా భారతమును పురాణముగా చెప్పించుకొని యాలకించుటయేకాక దానిని తెనుగుసేయ ప్రోత్సహించిరి, ఈనాడు నిత్యము మహా భారతము ఆంధ్ర దినపత్రికలో ప్రచురింపబడు భాగ్యము నా కబ్బజేసిన నాగరాజారావు గారికి మహాభారతము జగత్తులో నున్నంతవరకు నేను కృతజ్ఞుడనే.

మహాభారతము అను శాసనపర్వములో నున్న శివ సహస్రమునకు నీలకంఠ వ్యాఖ్య ననుసరించి అర్థము వ్రాయగా శ్రీ గాయత్రీ బాబా దానిని ప్రచురించుటకు పూనుకొనిరి.

ప్రచురించిన గాయత్రీ బాబా గారికి కృతజ్ఞతలు తెల్పు కొనుచున్నాను. శివ సహస్రము అర్థము ప్రచురించుట కిదియే తొలి యత్నము. ఇట్టి స్థితిలో నేను భారతమును తెనుగు సేయ బూనుకొనుట సాహసమేకాదు, దుస్సాహసము కూడ. తెనుగు సేతలోని దోషములను పరిత్యజించి గుణములనే గ్రహింపుడని ఆంధ్రుల కెల్లరకు విజ్ఞప్తి. కుమార సంభవము ముద్రితములో నున్నది. "మహాభారతం (ఆంధ్రపత్రిక డైరీ) రచయిత నుండి నిత్యము ప్రచురింపబడుచున్నది.

విధేయుడు,

రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి

# కృతజ్ఞతాంజలి

పరమ పవిత్రమైన యీ శివసహస్రనామ వివరణము వ్రాసి యిచ్చిన శ్రీమత్ భారత వ్యాఖ్యాత మహాపండితులు బ్రహ్మశ్రీ రాంపల్లి శ్రీరామమూర్తిగార్కి అడిగిన తడువగా వారి అమూల్యమైన అభిప్రాయమును వ్రాసి యిచ్చిన కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగార్కి, మహాకవి, శివదీక్షా దురంధరులు బ్రహ్మశ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ గార్కి ఆనంద రామాయణ గ్రంథకర్తలు బులుసు ఉదయభాస్కరంగార్కి బ్లాకుమేకింగువర్క్సు, మీనాక్షి ఎంటర్‌ప్రైజస్ వారికిన్ని యీ పుస్తకమునకు కావలసిన పేపరు, కైటిల్ ప్రింటింగు ద్రవ్య సహాయము చేసినటువంటి, శివదేవాలయము ప్రతిష్ఠ చేసినటువంటి చిరంజీవులు, వ్యాపారస్తులు, డోకి సత్యనారాయణ గార్కి తదితర చందాదారులకు, బహు సహాయము చేసిన శ్రీ నరాలశెట్టి హరి ప్రసాద్‌రావు వారి ధర్మపత్ని గార్కి, నా ఉపాసనా దేవత శ్రీ వేదమాత గాయత్రీదేవి ఆయురారోగ్య భోగభాగ్యములు ప్రసాదించి సదా రక్షించుగాక !

ఇట్లు,

శ్రీ గాయత్రీ సాహిత్య విజ్ఞానకేంద్రము

గాయత్రీ బాబా



42 Shiv Uma Ganesh J. B. KHANNA & Co.,

తూర్పు ముఖము

## తత్పురుష యంత్రము




" తత్పురుషాయ విద్మహే మహాదేవాయ
ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్ "
దీనినే రుద్రగాయత్రి అందురు.

## పడమర ముఖము

## వామదేవ యంత్రము




"సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః
భవేభవే నాతిభవే భవస్వ మాం భవోద్భవాయ నమః"

# ఉత్తర ముఖము

## సద్యోజాతము




"వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమః, రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయనమః బలప్రమథనాయ, సర్వభూతదమనాయ మనోన్మనాయనమః"

దక్షిణ ముఖము

## అఘోర యంత్రము



" అఘోరేభ్యోథఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః
శర్వ సర్వేభ్యో నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః "
(యంత్ర బలమునకై జపించు మంత్రము.)

# ఊర్ధ్వ ముఖము - ఈశాన యంత్రము

## శతరుద్ర సామ్రాజ్యదాయక యంత్రము - 169 గళ్ళు




" ఓం నమో భగవతే రుద్రాయ హుం ఫట్ స్వాహా "

" ఈశాన స్సర్వ విద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధి పతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్"

# మృత్యుంజయ యంత్రము

## మహామృత్యుంజయ త్ర్యంబకేశ్వరుని యంత్రము




" త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం, ఉర్వారుక
మివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ "

మహాగాయత్రీ సంపుటీకరణముగూడ గలదు.



వ్యవస్థాపకులు :

శ్రీ గాయత్రీబాబా

శ్రీ గాయత్రీ సాహిత్య విజ్ఞాన కేంద్రము

ఆర్యాపురం - మధ్యవీధి, రాజమండ్రి - 533 104.

శివభక్తులు



శ్రీమతి & శ్రీ పసుమర్తి నాగేశ్వరరావుగారు, A. G. M.
వైశ్యా బ్యాంకు - బెంగుళూరు



సంకలనకర్త :

బ్రహ్మశ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తిగారు

వారి ధర్మపత్ని

పోడూరు (ప॥ గో॥ జిల్లా)



శ్రీ శ్రీ శ్రీ

నిగమాగమాభిజ్ఞ నిరంతర సౌరోపాసక

శ్రీమత్సవితృ సూర్యపీఠ సంస్థాపక

యాగాధ్వర్య (స్మార్తాగమ ప్రవీణ)

**శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మశ్రీ వేమకోటి కృష్ణయాజీగారు**

సూర్యపీఠము, పార్వతీపురం.



శ్రీ గాయత్రీబాబా ధర్మపత్ని శ్రీమతి రాణీ



శి వ భ క్తు లు

శ్రీ ఉమామహేశ్వర దేవాలయ నిర్మాణ

పు ణ్య పు రు షు లు

## శ్రీ డేకి సత్యనారాయణమూర్తి

జ మి డి పే ట.

రాయగఢ్ ఒరిస్సా



శ్రీ టెంకాల సూర్యనారాయణమూర్తిగారు

వారి ధర్మపత్ని

టెక్కలి - 532 201

(శ్రీకాకోళం జిల్లా)



పుణ్యదంపతులు

శ్రీ నరాలశెట్టి హరిప్రసాదరావుగారు C.T.O. వారి ధర్మపత్ని



ఓం శ్రీ గాయత్రీ దేవ్యై నమః

# శ్రీ ఉమామహేశ్వర పూజా విధానము

(శైవాగమోక్తము)

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ
ధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్

హరిః ఓమ్ ఆచమ్య

ఓమ్ కేశవాయ స్వాహా
ఓమ్ నారాయణాయ స్వాహా
ఓమ్ మాధవాయ స్వాహా

} మూడు నామములతో మూడు సార్లు జలము లోపలకు పుచ్చుకొనవలయును.

(గోకర్ణమువలె చేతిని ముడచి మినపగింజ మునుగునంత నీరు చేతిలో పోసికొని గ్రహించవలయును.)

ఓమ్ గోవిందాయ నమః - (ఎడమ అరచేతిని కుడియరచేతితోను)
ఓమ్ విష్ణవే నమః - (కుడి యరచేతిని యెడమ అరచేతితోను)
ఓమ్ మధుసూదనాయ నమః - (బొటనవ్రేలితో పై పెదవిని)
ఓమ్ త్రివిక్రమాయ నమః - (బొటనవ్రేలితో క్రింది పెదవిని తడిచేతితో తాకి)
ఓమ్ వామనాయ నమః - (శిరమున జలము చల్లుకొనవలెను)
ఓమ్ శ్రీధరాయ నమః - (శిరమున నుదకము చల్లుకొనవలెను)

ఓమ్ హృషీకేశాయ నమః - (ఎడమ అరచేతిపైనను)
ఓమ్ పద్మనాభాయ నమః - (రెండు పాదములపైనను)
ఓమ్ దామోదరాయ నమః - (శిరముపైన జలము జల్లుకొనవలెను)
ఓమ్ సంకర్షణాయ నమః - (అన్ని వ్రేళ్లు ముడిచి ఆ వ్రేళ్ళ మొదళ్ళతో గడ్డము తాకవలయును)
ఓమ్ వాసుదేవాయ నమః - (ఎడమ ముక్కును)
ఓమ్ ప్రద్యుమ్నాయ నమః - (కుడిముక్కును బొటనవ్రేలు చూపుడువ్రేలితో తాకవలయును)
ఓమ్ అనిరుద్ధాయ నమః - (ఎడమ కన్నును తాకవలెను)
ఓమ్ పురుషోత్తమాయ నమః - (కుడికన్నును బొటనవ్రేలు యుంగరపు వ్రేలితో తాకవలయును)
ఓమ్ అధోక్షజాయ నమః - (ఎడమ చెవిని)
ఓమ్ నారసింహాయ నమః - (కుడిచెవిని నంగుష్ఠానమికలతో)
ఓమ్ అచ్యుతాయ నమః - బొడ్డును (అంగుష్ఠ కనిష్ఠికలతోను)
ఓమ్ జనార్దనాయ నమః - (అరచేతితో హృదయమును)
ఓమ్ ఉపేంద్రాయ నమః - (శిరమును కరాగ్రముతో తాకవలెను)
ఓమ్ హరయే నమః - (ఎడమ బాహుమూలమును వ్రేళ్ళుముడిచి తాకవలయును)
ఓమ్ శ్రీకృష్ణాయనమః (రెండుచేతులుకలిపి దండము పెట్టవలెను)

ప్రతి నామమునకు మొదట 'ఓమ్ అని అనవలెను.

ఓమ్ శివాయ నమః
మహేశ్వరాయ నమః
శంభవే నమః
భర్గాయ నమః
శంకరాయ నమః
శాశ్వతాయ నమః
పశుపతయే నమః
ఉమాపతయే నమః
పరబ్రహ్మణే నమః
బ్రహ్మాధిపతయే నమః
పరమేశ్వరాయ నమః
ఫాలలోచనాయ నమః

ఓమ్ అష్టమూర్తయే నమః
మృత్యుంజయాయ నమః
మృడాయ నమః
భూతేశాయ నమః
సర్వాయ నమః
సర్వేశ్వరాయ నమః
సర్వజ్ఞాయ నమః
సదాశివాయ నమః
అభవాయ నమః
భీమాయ నమః
వాసుదేవాయ నమః
త్రిపురాంతకాయ నమః

(మొదటి మూడు నామములకు ముమ్మారు ఉద్ధరణితో ఉదకమును చేతియందుంచుకొని పుచ్చుకొనవలయును. నమస్కరించుచు మిగిలిన నామములన్నియు చెప్పిన తరువాత చెక్కిళ్ళ యందు తాకవలయును. ఈ ఇరువదినాలుగు నామములకు మారుగా మొదట ఇవంబడిన ఓం కేశవాయస్వాహా యిత్యాది నామము లనుకూడ చెప్పుకొను సంప్రదాయము కలదు. అనంతరము గణపతిని ధ్యానించవలయును.)

## గణపతి ధ్యానము

శ్లో॥ శుక్లాంబరధరం - విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ - సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్రీ మహాగణాధిపతయే నమః

(గణపతిని ధ్యానించిన యనంతరము భూతోచ్చాటనము గావించవలయును. ఉదకమును చేతిలో పోసికొని క్రింది మంత్రమును చదివి యా జలమును విడువవలయును.)

## భూతోచ్చాటనము

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః – ఏతే భూమిభారకాః
ఏతేషాం అవిరోధేన - బ్రహ్మకర్మసమారభే ॥

(అనంతరము ప్రాణాయామము చేయవలయును.)

## ప్రాణాయామము

ఓం దైవీ గాయత్రీఛందః - ప్రాణాయామే వినియోగః॥

(అని కుడిచేతితో ముక్కును పట్టుకుని యీ క్రింది మంత్రమును ముమ్మారు పఠియించినచో ప్రాణాయామము చేసినట్లగును)

ఓం భూః - ఓం భువః - ఓగ్ం సువః - ఓం మహః - ఓం జనః - ఓం తపః - ఓగ్ం సత్యం - ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి - ధియోయోనః ప్రచోదయాత్ - ఓం ఆపోజ్యోతి రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

(ప్రాణాయామము చేసిన తరువాత సంకల్పమును చెప్పుకొనవలయును.)

# సంకల్పము

శివ శివ శంభో శంకర! రక్షమాం।

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ ఉమామహేశ్వర ప్రీత్యర్థం శివేశోభనే ముహూర్తే శ్రీ శివ శంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే - శ్వేత వరాహకల్పే - వైవస్వత మన్వంతరే-కలియుగే - ప్రథమపాదె - జంబూద్వీపే - భరతవర్షే - భరతఖండే - ఆంధ్ర ప్రదేశే - అస్మిన్ - వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన.... సంవత్సరే ....ఆయనే....ఋతౌ ....మాసే ....పక్షే ....తిథౌ .... వాసరే శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ భృంగిమహర్షి గోత్రోద్భవస్య....నామ ధేయస్య ధర్మపత్నీ సమేతస్య (వివాహితులకు మాత్రం) మమ క్షేమ స్థైర్య అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ఈప్సి తార్థ సిద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, సమస్త దురితోపశమ శాన్త్యర్థం, శ్రీ ఉమామహేశ్వర దేవతా ముద్దిశ్య శ్రీ ఉమామహేశ్వర దేవతా ప్రీత్యర్థం, యథా శక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥

(అని యుదకమును స్పృశింపవలయును. శైవ సంప్ర దాయమున భృంగిమహర్షి గోత్రము చెప్పుట కలదు. అట్లు చెప్పుటకు మనస్కరించనివారు వారి గోత్రనామముగా మార్చు కొనదగును. అనంతరము కలశపూజ కావింపవలయును.)

అదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణపతిపూజాం కరిష్యే।

గణపతిచెంత పుష్పముసుంచి నమస్కరించవలయును. బెల్లము నివేదించదగును. తరువాత ఉదకమును కలశమునకు గంధము, కుంకుమాదులు నూాడుచోటులందు బొట్టుపెట్టి - కలశమందు పుష్పమునుంచి చేతితో కలశమును మూసి)

తదంగ కలశ పూజాం కరిష్యే ॥

## కలశపూజ

శ్లో॥ కలశస్య ముఖేవిష్ణుః - కంఠే రుద్రస్సమాశ్రితః ।
మూలే తత్రస్థితో బ్రహ్మ - మధ్యే మాతృగణాస్మృతాః ॥

2. కుక్షౌతు సాగరాస్సర్వే - సప్తద్వీపావసుంధరా ।
ఋగ్వేదోఽథ యజుర్వేద - స్సామవేదోహ్యథర్వణః ॥

3. అంగైశ్చ సహితాస్సర్వే - కలశాంబు సమాశ్రితాః ।
గంగేచ యమునేచైవ - గోదావరి సరస్వతి ॥

4. నర్మదే సింధు కావేరీ - జలేస్మిన్ సన్నిధింకురు ।
ఆయాంతు దేవపూజార్థం - దురితక్షయ కారకాః ॥

మంత్రము - ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవఆపోన్న మాపోఽమృత మాస్సమ్రాడాపో విరాడాపస్స్వరాడా పశ్ఛన్దాగ్ం స్యా పోజ్యోగ్ష్యాపోయజూగ్ష్యా పస్సత్యమాపస్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్ ।

(అనంతరము కలశమునందలి జలమును చేతిలోపోసుకొని పూజాద్రవ్యముల మీదను శిరమునందును చల్లుకొనవలయును.)

## గణపతి పూజ

గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనాముపమశ్రవ స్తమం
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్వన్నూతి భిస్సీద సాధనమ్ ॥

మహాగణాధిపతిం ధ్యాయామి । మహాగణాధిపతిం ఆవాహయామి॥

విఘ్నేశ్వరాయ విద్మహే వక్రతుండాయ
ధీమహి తన్నో ప్రసన్నః ప్రచోదయాత్ ।
లం - పృథ్వీతత్త్వాత్మనే - గంధం సమర్పయామి ॥
హం - ఆకాశతత్త్వాత్మనే - పుష్పం సమర్పయామి ॥
యం - వాయుతత్త్వాత్మనే - ధూపమాఘ్రాపయామి ॥
రం - తేజస్తత్త్వాత్మనే - దీపం దర్శయామి ॥
వం - అమృత తత్త్వాత్మనే - నైవేద్యం సమర్పయామి ॥
సం - సర్వతత్త్వాత్మనే - సర్వోపచారపూజాం
సమర్పయామి ॥

గణేశాయ విద్మహే గణనాధాయ ధీమహి తన్నో ప్రసన్న
ప్రచోదయాత్ ॥

శ్లో॥ వక్రతుండ మహాకాయ - సూర్యకోటి సమప్రభ
అవిఘ్నం కురుమేదేవ - సర్వకార్యేషు సర్వదా
గణాధిపతిస్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు
మమ ఇష్టకామ్యార్థ ఫలసిద్ధిరస్తు॥
(అనంతరము శివునిపై నుదకమును చల్లుచు లేక విడచుచు)
ఓం శూలపాణియేనమః శివేహ ప్రతిష్టతోభవ.

## ధ్యానము

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం త్రినేత్రం పంచవక్త్రకం।
గంగాధరం దశభుజం - సర్వాభరణ భూషితం॥

2. నీలగ్రీవం శశాంకాంకం - నాగయజ్ఞోపవీతనం।
వ్యాఘ్రచర్మోత్తరీయంచ - వరేణ్య మభయప్రదం॥

3. కమండల్వాక్ష సూత్రాభ్యా - మన్వితం శూలపాణినం।
జ్వలంతం పింగళజటా - శిఖాముద్యోత ధారిణం॥

4. అమృతేనాప్లుతం హృష్ట - ముమాదేహార్థ ధారిణం।
దివ్య సింహాసనాసీనం - దివ్యభోగ సమన్వితం॥

5. దిగ్దేవతా సమాయుక్తం - సురాసుర నమస్కృతం।
నిత్యం చ శాశ్వతం శుద్ధం - ధృవమక్షర మవ్యయమ్॥
సర్వవ్యాపిన మీశాన - మేవం వై విశ్వరూపిణం॥
(పుష్పమును స్వామిపై నుంచవలయును. అనంతరము ఆవాహనమును చెప్పవలయును నమకమునందలి 23వ మంత్రము)

## ఆవాహనము

(మం) మానో మహా_న్త ముతమానో అర్భకం మాన ఉక్ష_న్తముతమాన ఉక్షితమ్ ! మానోవధీః పితరం మోత మాతరం ప్రియామాన_స్తనువః రుద్రరీరిషః ॥

ఓం ఉమామహేశ్వరాయ నమః । ఆవాహయమి ॥

(పుష్పము నుంచవలయును. తరువాత నమకము నందలి యాతే రుద్రయను ప్రథమ మంత్రముచే పుష్పాసనము సమర్పించవలయును.)

## ఆసనము

(మం) యాతే రుద్ర శివా తనూ రఘోరాఽపాపకాశినీ । తయాన_స్త మవాశంతమయా గిరిశ_న్తాభి చాకశీహి । ఓం మహేశ్వరాయ నమః – పుష్పాసనం సమర్పయామి.

(పుష్పము నుంచవలయును.)

## పాద్యం

(మం) యామిషు గిరిశ_న్త హ_స్తే బిభర్ష్య_స్తవే
శివాం గిరిత్రతాంకురు మా హింగ్ంసీః పురుషం జగత్
ఓం శంభవే నమః – పాద్యం సమర్పయామి.

(ఉదకమును విడువవలయును.)

## అర్ఘ్యం

(మం) శివేన వచసా త్వా గిరీశాచ్ఛా వదామసి ।
యథాన స్సర్వ మిజ్జగదయక్ష్మగ్ం సుమనా అసత్ ।
ఓం భర్గాయ నమః - అర్ఘ్యం సమర్పయామి.
(ఉదకమును విడువవలయును.)

## ఆచమనం

(మం) అధ్యవోచ దధివక్తా ప్రథమోదైవ్యోభిషక్ ।
అహీగ్‌చ్ఛ సర్వాన్జమ్భయన్థ్సర్వాశ్చ యాతుధ్యానః ॥
ఓం శంకరాయ నమః - ఆచమనీయం సమర్పయామి.
(ఉదకమును విడువవలయును.)

## స్నానం

(మం) అసౌ యస్తామ్రో అరుణ ఉతబభ్రుస్సుమంగలః ।
యే చే మాగ్ం రుద్రా అభితోదిక్షుః ।
శ్రితా స్సహస్రశోఽవైషాగ్ం హేడ ఈమహే ।
ఓం శాశ్వతాయ నమః - శుద్ధోదకస్నానం సమర్పయామి.

## పంచామృత స్నానం

(పాలు) ఆప్యాయ స్వసమేతుతే విశ్వతస్సోమవృష్టియం ॥
భవా వాజస్య సంగథే ।
ఓం పశుపతయే నమః - క్షీరేణ స్నపయామిః

(పెరుగు) దధిక్రావుణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్యవాజినః ।
సురభినో ముఖాకరత్ప్రమణ ఆయూగ్ంషి తారిషత్
ఓం ఉమాపతయే నమః - దధ్నాస్నపయామి ॥

(నేయి) శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవ స్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్యరశ్మిభిః
ఓం పరబ్రహ్మణే నమః - ఆజ్యేన స్నపయామి.

(తేనె) మధువాతా ఋతాయితే మధుక్షరంతి సింధవః
మాధ్వీన్న స్సంత్వోషధీః । మధున క్తముతోషసీ ॥
మధువత్పార్థిగ్ం రజః । మధుద్యౌరస్తునః పితా ।
మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తుసూర్యః ।
మాధ్వీర్గావో భవంతునః ।
ఓం బ్రహ్మాధిపతయే నమః । మధునా స్నపయామి.

(పంచదార) స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ
సహవీతునామ్నే । స్వాదుర్మిత్రాయ వరుణాయ
వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః
ఓం పరమేశ్వరాయ నమః । శర్కరయా స్నపయామి.

(కొబ్బరినీరు) యాః ఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః।
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచ స్త్వగ్ం హసః ॥
ఓం ఫాలలోచనాయ నమః - ఫలోదకేన స్నపయామి.

[తతః నమక చమక పురుషసూక్తేన శుద్ధోదకస్నానం
కుర్యాత్]

(శుద్ధోదకం) ఆపోహిష్ఠా మయోభువః - తానఊర్జే దధాతన ।
మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసః ।
తస్య భాజయతేహనః ఉశతీరివ మాతరః ।
తస్మా అరంగ మామవః యస్యక్షయాయ జిన్వథ ।
ఆపోజనయథాచనః
ఓం అష్టమూర్తయేనమః-శుద్ధోదకస్నానం సమర్పయామి.

## అభిషేకము

(ఈ క్రింది మన్త్రములను చదువుచు జలధార విడువవలయును.)

1. ఓం నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవేనమః ।
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తే నమః ॥

2. యాతే రుద్రశివా తనూ ర ఘోరాఽపాపకాశినీ ।
తయానస్తనువా శంతమయా గిరిశన్తాభి చాకశీహి ॥

3. యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే ।
శివాం గిరిత్రతాం కురు మా హి గ్ంసీః పురుషంజగత్ ॥

4. శివేన వచసా త్వా గిరిశాచ్ఛావదామసి ।
యథాన స్సర్వమిజ్జగద యక్ష్మగ్ం సుమనా అసత్ ॥

5. అధ్యవోచ దధివక్తా ప్రథమోదైవ్యోభిషక్ ।
అహీగ్శ్చ సర్వాఞ్జమ్భయ స్త్సర్వాశ్చ యాతుధాన్యః ॥

6. అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సుమంగలః ।
యే చేమాగ్ం రుద్రా అభితోదిక్షు ।
శ్రితాస్సహస్రశోఽవైషాగ్ం హేడ ఈమహే ॥

అసౌయోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః
ఉతైనం గోపా అదృశన్న దృశన్ను దహార్యః ।
ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః ॥
నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢూషే ।
అధోయే అస్య సత్వానోఽహంతేభ్యోఽకరం నమః ॥
ప్రముంచ ధనన స్త్వముభయో రార్త్నియోర్జ్యామ్ ।
యాశ్చతేహ స్త ఇషవః పరాతాభగవోవ ప
అవతత్య ధను స్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే ।
నిశీర్య శల్యానాం ముఖాశివో నస్సుమనాభవ ॥
విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత ।
అనేశన్న స్యేషవ ఆభురస్య నిషంగధిః ॥
యాతే హేతిర్మీఢుష్టమ హస్తేబభూవతే ధనుః ।
తయాఽస్మాన్విశత స్త్వమయక్ష్మయా పరిభ్భుజ ॥
నమస్తే అస్త్వాయుధాయాఽనా తతాయ ధృష్ణవే ।
ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాంతవ ధన్వనే ॥
పరితే దన్వనోహేతి రస్మాన్వృణక్తు విశ్వతః ।
అధోయఇషుది స్తవాఽఽరె అస్మిన్నిధే హితమ్ ॥
మనోమహా స్త ముతమానో అర్భకం మాన ఉక్ష స్త ముత
మాన ఉక్షితమ్ । మానోవధీః పితరం మోతమాతరం
ప్రియామాన స్త సువః । రుద్రతీరిషః ॥

16. మానస్తోకేతనయే మాన అయుషిమానో గోషుమానో (మం)
ఆశ్వేషు రీరిషః వీరాన్మానో రుద్రభామితో వధిర్హ్వ విష్మన్తో
సమసావిధేమతే ॥

అణోరణీయా మహామేవ కత్వం మహానహం విశ్వమిదం
విచిత్రం పురాతనోహం పురుషోహ మీశో హిరణ్యయోహం శివ (మం)
రూపమస్తి । ఓం మృత్యుంజయాయ నమః-అభిషేకం సమర్ప
యామి.

## వస్త్రం

17. అసౌ యో పసర్పతి నీలగ్రీవో విలోహితః
ఉత్తైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః
ఉతైనంవిశ్వా భూతాని దృష్టో మృడయాతినః (మం)
ఓం మృడాయనమః – వస్త్రయుగ్మం సమర్పయామి.

## కటిబంధనము

దీర్ఘాయుత్వాయ జరదష్టి రస్మిశతం జీవామిశరదః
పురూచిరాయ స్పోషమభిసంవ్య యిష్యే ।
ఓం భూతేశాయనమః-వస్త్రేణ కటిబంధనం సమర్పయామి.

## భస్మధారణం (మం)

అగ్నిరితిభస్మ వాయురితిభస్మ జలమితిభస్మ స్థలమితి
భస్మ వ్యోమేతిభస్మ సర్వగ్ం హావాయ ఇదగ్ం సర్వంభస్మ ।

(మం) త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్ ॥
ఓం శర్వాయనమః - ఇతి భస్మధారణం.

## యజ్ఞోపవీతం

(మం) యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచశుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తుతేజః
ఓం సర్వేశ్వరాయ నమః - యజ్ఞోపవీతం సమర్పయామి.

## గంధం

(మం) యోవై రుద్రస్య భగవాన్ యశ్చసోమో భూర్భువ
స్సువ స్తస్మైనమోనమశ్శీర్ షం జనదోం విశ్వరూపోసి
గంధద్వారాం దురాదర్షాం నిత్యపుష్టాం కరీషిణీం
ఈశ్వరీగ్ంసర్వభూతానాం త్వామిహోపహ్వయే శ్రియమ్
ఓం సర్వజ్ఞాయనమః - గంధాన్ ధారయామి.

## అక్షతలు

(మం) ఆయనే తే పరాయణే దూర్వారోహస్తు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహాఇమే
ఓం సదాశివాయనమః - అక్షతాన్ సమర్పయామి.

## బిల్వపత్రం

ఓం

(మం) యావైరుద్రస్య భగవాన్ యశ్చ సూర్యోభూర్భువస్సు
శ తస్మై వైజ నమోనమశ్శిరోషంజనదో విశ్వ
రూపా.

శ్లో॥ అమృతోద్భవ శ్రీవృక్షం శంకరస్య సదాప్రియా
తద్దే శంభో ప్రయచ్ఛామి బిల్వపత్రం సురేశ్వర ॥

2. త్రిశాఖై ర్బిల్వ పత్రైశ్చ అచ్ఛిద్రైః కోమలై శ్శుభైః ।
తవపూజాం కరిష్యామి అర్చయేత్పరమేశ్వరం ॥

3. గృహాణ బిల్వపత్రాణి సపుష్పాణి మహేశ్వర ।
సుగంధీని భవానీశ శివ త్త్వం కుసుమప్రియ ॥

ఓం అభవాయ నమః - బిల్వపత్రాణి సమర్పయామి.

(అనంతరం అష్టోత్తర శతనామైర్వా త్రిశతినామైర్వా సహ(
నామైర్వా ప్రపూజయేత్)

## అష్టోత్తర శతనామావళి

(ప్రతి నామమునకు ముందు "ఓం" అనియు చివర "నమః"
అనియు చేర్చి చదువవలయును.)

ఓం శివాయ నమః
మహేశ్వరాయ
శంభవే

ఓం పినాకినే నమః
శశిశేఖరాయ
వామదేవాయ

ఓం విరూపాక్షాయ నమః
కపర్దినే
నీలలోహితాయ
శంకరాయ 10
శూలపాణయే
ఖట్వాంగినే
విష్ణువల్లభాయ
శిపివిష్టాయ
అంబికానాథాయ
శ్రీకంఠాయ
భక్తవత్సలాయ
భవాయ
శర్వాయ
త్రిలోకేశాయ 20
శితికంఠాయ
శివప్రియాయ
ఉగ్రాయ
కపాలినే
కామారయే
అంధకాసురసూదనాయ
గంగాధరాయ

ఓం లలాటాక్షాయ నమః
కాలకాలాయ
కృపానిధయే 30
భీమాయ
పరశుహస్తాయ
మృగపాణయే
జటాధరాయ
కైలాసవాసినే
కవచినే
కఠోరాయ
త్రిపురాంతకాయ
వృషాంకాయ
వృషభారూఢాయ 40
భస్మోద్ధూళిత విగ్రహాయ
సామప్రియాయ
స్వరమయాయ
త్రయీమూర్తయే
అనీశ్వరాయ
సర్వజ్ఞాయ
పరమాత్మనే
సోమసూర్యాగ్నిలోచనాయ

ఓం హవిషే నమః
యజ్ఞమయాయ 50
సోమాయ
పంచవక్త్రాయ
సదాశివాయ
విశ్వేశ్వరాయ
వీరభద్రాయ
గణనాథాయ
ప్రజాపతయే
హిరణ్యరేతసే
దుర్ధర్షాయ
గిరీశాయ 60
గిరిశాయ
అనఘాయ
భుజంగభూషణాయ
భర్గాయ
గిరిధన్వనే
గిరిప్రియాయ
కృత్తివాససే
పురారాతయే
భగవతే
ప్రమథాధిపాయ 70

ఓం మృత్యుంజయాయ నమః
సూక్ష్మతనవే
జగద్వ్యాపినే
జగద్గురవే
వ్యోమకేశాయ
మహాసేన జనకాయ
చారువిక్రమాయ
రుద్రాయ
భూతపతయే
స్థాణవే 80
అహిర్బుధ్న్యాయ
దిగంబరాయ
అష్టమూర్తయే
అనేకాత్మనే
సాత్త్వికాయ
శుద్ధ విగ్రహాయ
శాశ్వతాయ
ఖండపరశవే
అజాయ
పాశవిమోచకాయ 90
మృడాయ
పశుపతయే

ఓం దేవాయ నమః
మహాదేవాయ
అవ్యయాయ
హరయే
పూషదంతభిదే
అవ్యగ్రాయ
దక్షాధ్వరహరాయ
హరాయ 100

ఓం భగనేత్రాభిదే నమః
అవ్యక్తాయ
సహస్రాక్షాయ
సహస్రపాదేయ
త్రివర్గప్రదాయ
తారకాయ
ఓం పరమేశ్వరాయనమః 108

శ్రీ ఉమామహేశ్వరాయనమః నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి. అష్టోత్తర శతనామపూజాం సమర్పయామి.

## ధూపం

వనవస్త్వా ధూపయంతు । గాయత్రేణ ఛందసాంగి
రస్వద్ధుద్రాస్త్వా భూపయంతు । త్రైష్టుభేన ఛంఛసాంగి
రస్వదాదిత్యాస్త్వాధూపయంతు । జాగతేన ఛందసాంగి
రస్వద్విశ్వేత్వా దేవావైశ్వానరా ధూపయంతు । అనుష్టుభేన
ఛందసాంగి
రస్వదింద్రస్త్వా ధూపయంత్వం । గిరిస్వద్విష్టుస్త్వా ధూపయర్వంగి
రస్వ ।

ద్వరుణస్త్వాధూపయత్వం గిరిస్వదదతిస్త్వా ధేవీర్విశ్వ దేవ్యావతీః
పృథివ్యాస్సభ స్థేంగి రసర్థసత్యవట దేవానాం త్వా పత్నీః ॥
ఓం భీమాయ నమః - ధూపం సమర్పయామి.

## దీపం

అపాణి పాదోహ మచింత్యశక్తిం, పశ్యామ్య చక్షుస్స
శృణోన్యకర్ణః సవేత్తివేద్యం నచతస్యాప్తి, వేత్తాత
మాహురగ్ర్యం పురుషం మహాంతం
సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితం
ఆత్మవిద్యాతపోమూలం తద్బ్రహ్మోపనిషత్పదం ॥
నతత్ర సూర్యోభాతిన చంద్రతారకం
నేమావిద్యుతో భాంతికుతో యమగ్ని
తమేవ భాంతి మనుభాంతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి ॥
ఓం వాసుదేవాయ నమః - దీపం సమర్పయామి
(అనంతరం ఆచమనం సమర్పించి నైవేద్యము నివ్వవలెను.)

## నైవేద్యము

(మం) దేవసవితః ప్రసువసత్యంత్వర్తేన పరిషించామి
అమృతమస్తు అమృతోపస్తరణ మసిస్వాహా ।
ఓం ప్రాణాయస్వాహా।అపనాయస్వాహా, వ్యానాయస్వాహా,
ఉదానాయస్వాహా, సమానాయస్వాహా, బ్రహ్మణేస్వాహా,

ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య
ధీమహి ధియోయోనః, ప్రచోదయాత్ ఓమాపోజ్యోతి
రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్ తత్పురుషాయ
విద్మహే
మహాదేవాయ ధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్ ॥
(ఉదకమును ప్రోక్షించి నివేదన చేయవలయును.)
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.

అమృతాపిధానమసి ॥ ఉత్తరాపోశనం సమర్పయామి। హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। పునరాచమనీయం సమర్పయామి.

## తాంబూలం

(మం) ఇమారుద్రాయ తపసే కపర్దినేక్షయద్వీరాయ ప్రభరామహే మతిం। యథానశ్శమ సద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మిన్న నాతురమ్ ॥

ఓం త్రిపురాంతకాయ నమః - తాంబూలం సమర్పయామి.
తాంబూల చర్వణానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

## నీరాజనం

శ్లో॥ పరానంద చిదాకాశ - పరబ్రహ్మస్వరూపికా ।
నీరాజనం గృహాణేశ - ఆనందాఖ్యం సదాశివ ॥

(మం) సర్వప్రజాయే గోపాయ - అమృతతత్త్వాయ జీవసే జనిష్య మాణాంచ । అమృతే సత్యేప్రతిష్ఠితామ్ । అధర్వ పితుం మే గోపాయ రసమన్న మిహాయుషే । అదబ్ధాయోఽశీతతనో ! అవిషన్నః పితుంకృణు । శగ్గ్స్వ పశూన్మే గోపాయ । ద్విపా దోయే చతుష్పదః । అష్టాశపాశ్చయ ఇహాగ్నే । యేచైక్ శఫా అశునాః । సప్రథస్సభాంమేగోపాయయేచసభ్యాస్సభాసదః । తానిం ద్రియావతాఃకురు సర్వమాయురు పాసతామ్ అహేబుధ్నియ మంత్రం మేగోపాయ యమృషయస్త్రైవిదావిదుః । ఋచస్సా మానియజూగ్ంషి సాహిశ్రీ రమృతాసతామ్ । మానోహిగ్ంసీ జ్జాతవేదో గామశ్వం పురుషం జగత్ అబిభ్రదగ్న ఆగహిశ్రియా మాపరిపాతయా సంమ్రాజంచ విరాజంచాభి శ్రీర్యాచనో గృహే లక్ష్మీరాష్ట్రస్యయాముఖే తయామాసగ్ం సృజామసి సంతత శ్రీరస్తు నిత్యశ్రీరస్తు । నిత్యమంగళాని భవంతు ।

ఓం ఉమామహేశ్వరాయనమః కర్పూరనీరాజనం సమర్ప యామి ।

అనంతరం ఆచమనీయం సమర్పయామి.

—* మంత్రపుష్పం *—

1. సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువమ్ ।
విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్ ॥

2. విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।
విశ్వమే వేదం పురుష స్తద్విశ్వముపజీవతి ॥

3. పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానాం పరాయణం॥

4. నారాయణ పరోజ్యోతిరాత్మా నారాయణః పరః।
నారాయణ పరంబ్రహ్మతత్త్వం నారాయణః పరః।
నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః॥

5. యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః॥

6. అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వ
శమ్భువం।
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం॥

7. అధోనిష్ట్యావితస్త్యాన్తేనాభ్యా ముపరితిష్ఠతి।
జ్వాలామాలాఽఽకులం భాతి విశ్వస్యాయతనం
మహత్॥

8. సన్తతగ్ం శిలాభిస్తులమ్బత్యాకోశసన్నిభం।
తస్యాన్తేసుషిరగ్ం సూక్ష్మం తస్మిన్థ్సర్వం ప్రతిష్ఠితం॥

9. తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చిర్విశ్వతోముఖః।
సోఽగ్రభుగ్వి భయంతిష్ఠన్నాహార సుజరః కవిః।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీరశ్మయస్తస్యసన్తతా॥

10. సంతాపయతి స్వం దేహమపాద తలమస్తగః।
తస్యమధ్యేవహ్నిశిఖాఅణీయోర్ధ్వావ్యవస్థితః॥

11. నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేనభాస్వరా ।
నీ వారశూక వ త్తన్వీ పీతాభాస్వత్యణూపమా ॥

12. తస్యాశిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః ।
సబ్రహ్మా సశివస్సహరిస్సేన్ద్రస్సోఽక్షరం
పరమస్స్వరాట్ ॥

రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే । నమోవయం వైశ్రవ ణాయ కుర్మహే । సమేకామాన్ కామకామాయమహ్యం । కామే శ్వరో వైశ్రవణోదదాతు । కుబేరాయ వైశ్రవణాయ । మహా రాజాయనమః

ఓం తద్బ్రహ్మ - ఓం తద్వాయుః । ఓం తదాత్మా ।
ఓం తత్సత్యం ఓం తత్సర్వం । ఓం తత్పురోర్నమః ॥

అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు । త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః । త్వం తదాప ఆపోజ్యోతి రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ।

ఈశానస్సర్వ విద్యానామీశ్వర స్సర్వభూతానాం । బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోం ॥ (లక్ష్మీం క్షీరసముద్ర.... నమోఽస్తుతే)

(తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్)

ఓం ఉమామహేశ్వరాయ నమః - సువర్ణదివ్య మంత్ర పుష్పం సమర్పయామి.

## ఆత్మప్రదక్షిణము

శ్లో॥ యానికాని చ పాపాని - జన్మాంతరకృతానిచ
తానితాని ప్రణశ్యంతి - ప్రదక్షిణ పదేపదే

2. పాపోఽహం పాపకర్మాహం - పాపాత్మా పాపసంభవః।
త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల ॥

3. అన్యథా శరణంనాస్తి - త్వమేవ శరణం మమ।
తస్మాత్కారుణ్యభావేన - రక్ష రక్షో మహేశ్వర

శ్రీ ఉమామహేశ్వరాయనమః - ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

## అర్పణం

శ్లో॥ యద్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందే తమీశ్వరం॥

2. మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

3. సుప్రీత స్సుప్రసన్నో వరదోభవతు.
శ్రీ ఉమామహేశ్వర ప్రసాదం శిరసాగృహ్ణామి.
(పుష్పాదులు శిరసున ధరించవలయును.)

## తీర్థస్వీకరణం

శ్లో॥ అకాలమృత్యుహరణం - సర్వవ్యాధి నివారణం
సమస్తపాపక్షయకరం - ఉమామహేశ్వర పాదోదకం
పావనం శుభం ॥

(ఉమామహేశ్వర అనుచు స్వామి పాదతీర్థమును పుచ్చుకొనవలయును)

శుభం భూయాత్ !

ఇతి శ్రీమత్ కోదండరామార్పణమస్తు !

## జపప్రకరణమ్

అస్యశ్రీ శుద్ధ పంచాక్షరీ మహామంత్రస్య వామదేవ ఋషిః - భూరుగనుష్టుప్ ఛందః - శ్రీ ఉమామహేశ్వరదేవతా ఓం బీజం॥ నమశ్శక్తిః - శివాయేతి కీలకం మమ శ్రీ ఉమామహేశ్వర ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

ఓం నంసద్యోజాత ప్రపద్యామి ॥ భవోద్భవాయనమః - ప్రాం॥ అంగుష్ఠాభ్యాం నమః। ఓం మం వామదేవాయనమః ॥ ప్రీం తర్జనీభ్యాం నమః। ఓం శిం అఘోరేభ్యోథ - ఘోరేభ్యః॥ ప్రూం మధ్యమాభ్యాం ఓం వాం తత్పురుషాయ....చోదయాత్। ప్రైం - అనామికాభ్యాం। ఓం యం ఈశానస్సర్వ .... ఉమామహేశ్వర శివోం। ప్రౌం కనిష్ఠికాభ్యాం। ఓం నమశ్శివాయ సద్యోజాతం ప్రపద్యామి....ఉమామహేశ్వరోం।

ప్రః కరతలం। ఏవం ప్రకారేణ హృదయాది షడంగ న్యాసం కుర్యాత్। భూర్భువస్సువరోమితి దిగ్బంధః ॥

## ధ్యానం

శ్లో॥ వందేహరం వరదశూల కపాలహస్తం
సా భీతి ముద్రసుతనోజ్జ్వల పూర్ణకాంచీ
వామోరు పీనగత యోర్నిజ వామహస్తా
న్యస్తారుణోత్పలకుచో పరిబద్ధదేహం॥

## లమిత్యాది పంచపూజ

అథ "ఓం నమశ్శివాయ" యథాశక్తి జపం కుర్యాత్।
ఏవం శ్రీ ఉమామహేశ్వరార్పణమస్తు॥
పునః ఋష్యాది అంగన్యాస కరన్యాసాదిధ్యానాంతం
కుర్యాత్।

## అథ ధ్యానం

శ్లో॥ ఓంకారం బిందు సంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః।
కామదం మోక్షదం చైవ ఓంకారాయ నమోనమః॥

2. నజాతి ర్నమృతిర్యస్య క్షయోయస్య నవిద్యతే।
నమం తే దేవతాస్సర్వే నకారంతం-నమామ్యహం॥

3. మహాదేవం మహావక్త్రం మహాధ్యాన పరాయణం।
మహాపాపహరం దేవం మకారంతం నమామ్యహం॥

4. శివాత్పరతరోనాస్తి శివశ్శాస్త్రేషు నిశ్చయః।
శమంత పర్వపాపాలి శకారం తం నమామ్యహం॥

5. వాహనం వృషభోయస్య వాసుకి కంఠభూషణం।
వామేశక్తిధరం దేవం వకారం తం నమామ్యహం॥

6. యత్రయత్రస్థితో దేవః సర్వవ్యాపీ మహేశ్వరః ।
యోగురుస్సర్వ దేవానాం యకారం తం నమామ్యహం ॥
7. ఇదం షడక్షరీస్తోత్రం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
ముచ్యతే సర్వ పాపేభ్యో శివలోకం స గచ్ఛతి ॥
8. తతః శివదీక్షితానాం భక్తజనానాం విద్వజ్జనానాం ।
కర్తృణాం చేతర జనానాం సర్వేషాం ఈశ్వరప్రసాద
ద్రవ్యాణి ప్రదాస్య ॥
9. తద్ధర్మేణ సకల భక్తజన సౌభాగ్య సంత్కారాయు
ష్యాభి వర్ధిర్భవతి ॥ శ్రీ శ్రీ శ్రీ

## ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథంచ-శ్రీశైలే మల్లికార్జునం
ఉజ్జయన్యాం మహాకాలం-మోంకారే పరమేశ్వరం
కేదరం హిమవత్ పృష్ఠే-ఢాకిన్యాం భీమశంకరం
వారణస్యాంచ విశ్వేశం-త్ర్యంబకం గౌతమీ తటే
వైద్యనాథం చితాభూమౌ-నాగేశం దారుకావనే
సేతు బంధేచ రామేశం-ఘుశ్మేశంచ శివాలయే.

ఫలశ్రుతి :-

ద్వాదశైతాని నామాని-ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
సర్వపాప వినిర్ముక్తః సర్వసిద్ధి ఫలం లభేత్ ।
యం యం కామ మపేక్ష్యాచ పఠిష్యంతి నరోత్తమా ॥
ప్రాప్స్యంతి కామం తం తంహిత్రేహ మునీశ్వరాః ॥
ఇతీ శైవాగమోక్త నిత్యశివార్చనావిధిస్సమాప్త
శుభం భూయాత్ ।

ఇతి శ్రీ ఉమాసహిత మహేశ్వరార్పణ మస్తుః

# శివ సహస్రనామ స్తోత్రమ్

ఓమ్. స్థిరః స్థాణుః ప్రభు ర్భీమః ప్రవరో వరదో వరః, 1
సర్వాత్మా సర్వవిఖ్యాత స్సర్వ స్సర్వకరో భవః,
జటీ చర్మీ శిఖండీ చ సర్వాంగస్సర్వభావనః 2
హరశ్చ హరిణాక్షశ్చ సర్వభూతహరః ప్రభుః,
ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ నియత శ్శాశ్వతో ధ్రువః, 3
శ్మశానవాసీ భగవాన్ ఖచరో గోచరోఽర్దనః,
అభివాద్యో మహాకర్మా తపస్వీ భూతభావనః, 4
ఉన్మత్తవేషః ప్రచ్ఛన్న స్సర్వలోకప్రజాపతిః,
మహారూపో మహాకాయో వృషరూపో మహాయశాః, 5
మహాత్మా సర్వభూతాత్మా విశ్వరూపో మహాహనుః,
లోకపాలోఽంతర్హితాత్మా ప్రసాదో నీలలోహితః, 6
పవిత్రం చ మహాంశ్చైవ నియమో నియమాశ్రితః,
సర్వకర్మా స్వయంభూత ఆదిరాదికరో నిధిః, 7
సహస్రాక్షో విశాలాక్ష స్సోమో నక్షత్రసాధకః,
చంద్రస్సూర్యశ్శనిః కేతు ర్గ్రహో గ్రహపతి ర్వరః. 8
ఆదిరంతో లయః కర్తా మృగబాణార్పణోఽనఘః,
మహాతపా ఘోరతపా అదీనో దీనసాధకః. 9

సంవత్సరకరో మంత్రః ప్రమాణం పరమం తపః,
యోగీ యోజ్యో మహాబీజో మహారేతా మహాబలః. 10
సువర్ణరేతా స్సర్వజ్ఞ స్సుబీజో బీజవాహనః,
దశబాహు స్త్వనిమిషో నీలకంఠ ఉమాపతిః. 11
విశ్వరూప స్స్వయంశ్రేష్ఠో బలవీరో బలోగణః,
గణకర్తా గణపతి ర్దిగ్వాసాః కామ ఏవచ. 12
మంత్రవి త్పరమో మంత్రః సర్వభావకరో హరః,
కమండలుధరో ధన్వీ బాణహస్తః కపాలవాన్. 13
అశనీ శతఘ్నీ ఖడ్గీ పట్టిసీ చాయుధీ మహాన్
స్రువహస్త స్సురూపశ్చ తేజస్తేజస్కరో నిధిః. 14
ఉష్ణీషీ చ సువక్త్రశ్చ ఉదగ్రో వినత సథా,
దీర్ఘశ్చ హరికేశశ్చ సుతీర్థః కృష్ణఏవచ, 15
సృగాలరూపస్సిద్ధార్థో ముండ స్సర్వశుభంకరః,
అజశ్చ బహురూపశ్చ గంధధారీ కపర్ద్యపి. 16
ఊర్ధ్వ రేతా ఊర్ధ్వలింగ ఊర్ధ్వశాయీ నభస్థలః,
త్రిజటశ్చీరవాసాశ్చ రుద్ర స్సేనాపతిర్విభుః. 17
అహశ్చరో నక్తంచర స్తిగ్మమన్యు స్సువర్చసః,
గజహా దైత్యహా కాలో లోకధాతా గుణాకరః 18
సింహశార్దూలరూపశ్చ ఆర్ద్ర(వ్యాఘ్ర) చర్మాంబరావృతః,
కాలయోగీ మహానాథ స్సర్వకామ శ్చతుష్పథః. 19
నిశాచరః ప్రేతచారీ భూతచారీ మహేశ్వరః,
బహుభూతో బహుధరః స్వర్భాను రమితో గతిః. 20

నృత్యప్రియో నిత్యనర్తో న ర్తక స్సర్వలాలసః,
ఘోరో మహాతపాః పాశో నిత్యోఽనిహో నిరాలయః. 21
సహస్రహస్తో విజయో వ్యవసాయో హ్యతంద్రితః,
అధ(మ)ర్షణో (మ)ధర్షణాత్మా యజ్ఞహో కామనాశకః. 22
దక్షయాగాపహారీచ సుసహో మధ్యమ స్తథా,
తేజోఽపహారి బలహో ముదితోఽర్థోఽజితో వరః. 23
గంభీరఘోషో గంభీరో గంభీరబలవాహనః,
న్యగ్రోధరూపో న్యగ్రోధవృక్షకర్ణస్థితి ర్విభుః. 24
సుతీక్ష్ణదశనశ్చైవ మహాకాయో మహాస (న)నః,
విష్వక్సేనో హరి ర్యజ్ఞ స్సంయుగాపీడవాహనః. 25
తీక్ష్ణతాపశ్చ హర్యశ్వ స్సహాయః కర్మకాలవిత్,
విష్ణుప్రసాదితో యజ్ఞసముద్రో బడబాముఖః, 26
హుతాశనసహాయశ్చ ప్రశాంతాత్మా హుతాశనః,
ఉగ్రతేజా మహాతేజా జన్యో విజయకాలవిత్. 27
జ్యోతిషామయనం సిద్ధి స్సర్వవిగ్రహ ఏవచ,
శిఖీ ముండీ జటీ జ్వాలీ మూర్తిజో మూర్ధగో బలీ. 28
[2]వైష్ణవః పణవీతాళీ ఖ(ఖే)లీ కాలకటంకటః,
నక్షత్రవిగ్రహమతి ర్గుణబుద్ధిర్ల యోఽగమః. 2
ప్రజాపతి ర్విశ్వబాహు ర్విభాగ స్సర్వతోముఖః,
విమోచన స్సుస(మ)రణో హిరణ్యకవచోద్భవః 30
మే(ఘ)ఢ్రిజో బలచారీ చమహీచారీ స్తుత స్తథా,
సర్వతూర్యనినాదీ చ,సర్వవాద్యపరిగ్రహః. 31

మహా ఘోరతపాఃశ్చూరో

వ్యాళరూపో గుహావాసీ, గ్రహమాలీ తరంగవిత్.,
త్రిదశః కాలదృక్కర్మసర్వబంధవిమోచనః. 32
బంధన స్త్వసురేంద్రాణాం. యుధి శత్రువినాశనః,
సాంఖ్యప్రసాదో దుర్వాసా. స్సర్వసాధునిషేవితః. 33
ప్రస్కందనో విభాగజ్ఞో హ్యతుల్యో యజ్ఞభాగవిత్,
సర్వవాస స్సర్వచారీ దుర్వాసా వాసవోఽమరః. 34
హైమో హేమకరో యజ్ఞ స్సర్వధారీ ధరోత్తమః,
లోహితాక్షో మహాక్షశ్చ. విజయాక్షో విశారదః. 35
సంగ్రహో నిగ్రహః కర్తా సర్పచీరనివాసనః,
ముఖ్యోఽముఖ్యశ్చ దేహశ్చ కాహళి స్సర్వకామదః. 36
సర్వకాల ప్రసాదశ్చ సుబలో బలరూపభృత్,
సర్వకామవర(ప్రద)శ్చైవ సర్వద స్సర్వతోముఖః. 37
ఆకాశనిర్విరూపశ్చ నిపాతో హ్యవశః ఖగః,
రౌద్రరూపోఽంశురాదిత్యో బహురశ్మి స్సువర్చసీ. 38
వసువేగో మహావేగో మనోవేగో నిశాచరః,
సర్వవాసీ శ్రియావాసీ ఉపదేశకరోఽకరః. 39
మునిరాత్మా నిరాలోక స్సంభగ్నశ్చ సహస్రదః,
పక్షీ చ ప(ప్ల)క్షరూపశ్చ అతిదీప్తో విశాంపతిః. 40
ఉన్మాదో మదనః కామో హ్యశ్వత్థోఽర్థకరోయశః,
వామదేవశ్చ వామశ్చ ప్రాగ్దక్షిణ ఉదఙ్ముఖః. 41
సిద్ధయోగీ మహర్షిశ్చ సిద్ధార్థ స్సిద్ధసాధకః,
భిక్షుశ్చ భిక్షురూపశ్చ విపణో మృదురవ్యయః. 42

మహాసేనో విశాఖశ్చ షష్టిభాగో గవాంపతిః,
వజ్రజిహ్వశ్చ విష్కంభీ, చమూస్తంభన ఏవచ. 43
వృత్తావృత్త కరస్తాలో మధుర్మధుకలోచనః,
వాచస్పత్యో వాజసనో నిత్యమాశ్రితపూజితః. 44
బ్రహ్మచారీ లోకచారీ సర్వచారీ విచారవిత్
ఈశాన ఈశ్వరః కాలో నిశాచారీ పినాకభృత్. 45
నిమిత్తస్థో నిమిత్తం చ నందిర్నందికరో హరిః,
నందీశ్వరశ్చ నందీ చ నందనో నందివర్ధనః. 46
భగహారీ నిహంతా చ కాలో బ్రహ్మ పితామహః,
చతుర్ముఖో మహాలింగశ్చారులింగ స్తథైవ చ. 47
లింగాధ్యక్షః సురాధ్యక్షో యోగాధ్యక్షో యు(రు)గావహః,
బీజాధ్యక్షో బీజకర్తా ఆధ్యాత్మానుగతో బలః. 48
ఇతిహాస స్సకల్పశ్చ గౌతమోఽథ నిశాకరః,
దంభో హ్యదంభో వైదంభో వశ్యో వశకరః కలిః. 49
లోకకర్తా పశుపతి ర్మహాకర్తా హ్యనౌషధః,
అక్షరం పరమం బ్రహ్మ బలవాఽ శ్శక్త ఏవచ. 50
నీతి ర్హ్యనీతి శ్శుద్ధాత్మా శుద్ధో మాన్యో గతాగతః,
బహుప్రసాదస్సుస్వప్నో దర్పణోఽథ త్వమిత్రజిత్. 51
వేదకారో మంత్రకారో విద్వా న్సమరమర్దనః,
మహామేఘనివాసీ చ మహాఘోరో వశీకరః, 52
అగ్నిజ్వాలో మహాజ్వాలో హ్యతి ధూమ్రోహుతో హవిః,
వృష(భ)ణ శ్శంకరో నిత్యం వర్చస్వీ ధూమకేతనః, 53

నీల స్తథాంగలుబ్ధశ్చ శోభనో నిరవగ్రహః,
స్వస్తిద స్వస్తిభావశ్చ భాగీ భాగకరో లఘుః. 54
ఉత్సంగశ్చ మహాంగశ్చ మహాగర్భపరాయణః,
కృష్ణవర్ణ స్సువర్ణశ్చ ఇంద్రియం సర్వదేహినామ్. 55
మహాపాదో మహాహస్తో మహాకాయో మహాయశాః,
మహామూర్ధా మహామాత్రో మహానేత్రో నిశాలయః. 56
మహాంతకో మహాకర్ణో మహోష్ఠశ్చ మహాహనుః,
మహానాసో మహాకంబు ర్మహాగ్రీవశ్మ్శశానభాక్. 57
మహావక్షా మహోరస్కో హ్యంతరాత్మా మృగాలయః,
లంబనో లంబితోష్ఠశ్చ మహామాయః పయోనిధిః 58
మహాదంతో మహాదంష్ట్రో మహాజిహ్వో మహాముఖః,
మహానఖో మహారోమా మహాకేశో మహాజటః. 69
ప్రసన్నశ్చ ప్రసాదశ్చ ప్రత్యయో గిరిసాధనః,
స్నేహనోఽస్నేహనశ్చైవ అజితశ్చ మహామునిః. 60
వృక్షాకారో వృక్షకేతు రనలో వాయువాహనః,
గండలీ మేరుధామా చ దేవాధిపతిరేవ చ. 61
అథర్వశీర్షసామాస్య ఋక్సహస్రామితేక్షణః,
యజుఃపాదభుజో గుహ్యః ప్రకాశో జంగమ స్తథా. 62
అమోఘార్థః ప్రసాదశ్చ అభిగమ్యస్సుదర్శనః,
ఉపకారః ప్రియ స్సర్వః కనకః కాంచనచ్ఛవిః. 63
నాభి ర్నందికరో భావః పుష్కరః స్థపతిస్థిరః,
ద్వాదశస్త్రాసన శ్చాద్యో యజ్ఞో యజ్ఞసమాహితః, 64

న_క్తం కలిశ్చ కాలశ్చ మకరః కాలపూజితః,
సగణో గణకారశ్చ భూతవాహనసారథిః, 65
భస్మాశయో భస్మగోప్తా భస్మభూత_స్తరు ర్గణః
లోకపాల _స్తథాలోకో మహాత్మా సర్వపూజితః. 66
--క్ల త్రి శుక్లః సంపన్న శ్శుచిర్భూతనిషేవితః,
ఆశ్రమస్థః క్రియావస్థో విశ్వకర్మమతి ర్వరః. 67
విశాలశాఖ స్తామ్రోష్ఠో హ్యంబుజాల స్సునిశ్చలః,
కపిలః కపిశ శ్శుక్ల ఆయుశ్చైవ పరోఽపరః. 68
గంధర్వో హ్యదితి స్తార్క్ష్య స్సువిజ్ఞేయ స్సుశారదః,
పరశ్వధాయుధో దేవో హ్యనుకా సుబాంధవః, 79
తుంబవీణో మహాక్రోధ ఊర్ధ్వరేతా జలేశయః,
ఉగ్రో వంశకరో వంశో వంశనాదో హ్యనిందితః, 70
సర్వాంగరూపో మాయావీ సుహృదో హ్యనిలోఽనలః,
బంధనో బంధక_ర్తా చ సుబంధనవిమోచనః. 71
సయజ్ఞారి స్సకామారి ర్మహాదంష్ట్రో మహాయుధః.
బహుధానిందితశ్శర్వశ్శంకరః [1] 72
అమరేశో మహాదేవో విశ్వదేవ స్సురారిహా,
అహిర్బుధ్న్యోఽనిలాభశ్చ చేకితానో హరి_స్తథా. 73
అజైకపాచ్చ కాపాలీ త్రిశంకురజితశ్శివః,
ధన్వంతరి ర్ధూమకేతు స్స్కందో వైశ్రవణ సథా. 74
ధాతా శక్రశ్చ విష్ణుశ్చ మిత్ర_స్త్వష్టా ధ్రువో ధరః,
ప్రభావస్సర్వగో వాయు రర్యమా సవితా రవిః. 75

చన్ద్రశేఖరః

ఉపంగుశ్చ విధాతా చ మాంధాతా భూతభావనః,
విభు ర్వర్ణవిభావీ చ సర్వకామగుణావహః. 76
పద్మనాభో మహాగర్భ శ్చంద్రవక్త్రోఽనిలోఽనలః,
బలవాంశ్చోపశాంతశ్చ పురాణః పుణ్యచంచరీ. 77
కురుకర్తా కురూవాసీ కురుభూతో గుణౌషధః,
సర్వాశయో గ(ద)ర్భచారీ సర్వేషాం ప్రాణినాం పతిః. 78
దేవదేవస్సుఖాసక్త స్సదసత్సర్వరత్నవిత్,
కైలాసగిరివాసీ చ హిమవద్గిరిసంశ్రయః. 79
కూలహారీ కూలకర్తా బహువిద్యో బహుప్రదః,
వణిజోవర్ధకీ వృక్షో వకుళశ్చందనచ్ఛదః. 80
సారగ్రీవో మహాజత్రురలోలశ్చ మహౌషధః,
సిద్ధార్థకారీ సిద్ధార్థ శ్ఛందోవ్యాకరణోత్తరః. 81
సింహనాద స్సింహదంష్ట్రః సింహగ స్సింహవాహనః,
ప్రభావాత్మా జగత్కాలః కాలో లోకహిత స్తరుః. 82
సారంగో నవచక్రాంగః కేతుమాలీ సభావనః,
భూతాలయో భూతపతి రహోరాత్ర మనిందితః. 83
వాహితా వర్థితః [1]సర్వభూతానాం నిలయశ్చ విభుర్భవః,
అమోఘ స్సంయతో హ్యశ్వో భోజనః ప్రాణధారణః. 84
ధృతిమాన్ మతిమాన్ దక్షః సత్కృతశ్చ యుగాధిపః,
గోపాలీ గోపతిర్గ్రామో గోచర్మవసనో హరిః. 85
హిరణ్యబాహుశ్చ తథా గుహాపాలః ప్రవేశకః,
ప్రకృష్టారిర్మహాహర్షో జితకామో జితేంద్రియః. 86

గాంధారశ్చ సువాసశ్చ తపస్సక్తో రతిర్నరః,
మహాగీతో మహానృత్యో హ్యప్సరోగణ సేవితః, 87
మహాకేతు ర్మహాధాతు ర్నైకసానుచర శ్చలః,
ఆవేదనీయ ఆవేశః సర్వగంధసుఖావహః. 88
తోరణస్తారణో వాతః పరిధీపతిఖేచరః,
సంయోగో వర్ధనో వృద్ధో హ్యతివృద్ధో గుణాధికః. 89
నిత్య ఆత్మా సహాయశ్చ దేవాసురపతిః పతిః,
యుక్తశ్చ యుక్తబాహుశ్చ దేవో దివి సుపర్వణః. 90
ఆషాఢశ్చ సుషాఢశ్చ ధ్రువోఽథ హరిణో హరః,
వపురావర్తమానేభ్యో వసుశ్రేష్ఠో మహాపథః. 91
శిరోహారీ విమర్శశ్చ సర్వలక్షణలక్షితః,
అక్షశ్చ రథయోగీ చ సర్వయోగీ మహాబలః. 92
సమామ్నాయోఽసమామ్నాయ స్తీర్థదేవో మహారథః,
నిర్జీవో జీవనో మంత్రశ్శుభాక్షో బహుకర్కశః. 93
రత్నప్రభూతో రక్తాంగో మహార్ణవనిపానవిత్,
మూలం విశాలోహ్యమృతో వ్యక్తావ్యక్త స్తపోనిధిః, 94
ఆరోహణోఽధిరోహశ్చ శీలధారీ మహాయశాః,
సేనాకల్పో మహాకల్పో యోగో యోగకరో హరిః. 95
యుగరూపో మహారూపో మహానాగహనో వధః,
న్యాయనిర్వపణః పాదః పండితో హ్యచలోపమః. 96
బహుమాలో మహామాల శ్శశీహరిసులోచనః,

విస్తారోలవణః కూపస్త్రి యుగస్సఫలోదయః. 97
త్రినేత్రశ్చ విషణ్ణాంగో మణివిద్ధో జటాధరః,
బిందు ర్విసర్గ స్సుముఖః శర స్సర్వాయుధస్సహః. 98
నివేదనస్సుఖాజాతః సుగంధారో మహాధనుః,
గంధపాలీ చ భగవానుత్థానః సర్వకర్మణామ్, 99
మంథానోబహుళో వాయుః సకల స్సర్వలోచనః,
తలస్తాలః కరస్థాలీ ఊర్ధ్వసంహననో మహాన్, 100
ఛత్రం సుఛత్రో విఖ్యాతో లోక స్సర్వాశ్రయః క్రమః,
ముండో విరూపో వికృతోదండీ కుండీ వికుర్వణః. 101
హర్యక్షః కకుభోవజ్రీ శతజిహ్వస్సహస్రపాత్,
సహస్రమూర్ధా దేవేంద్ర స్సర్వదేవమయో గురుః. 102
సహస్రబాహు స్సర్వాంగః శరణ్య స్సర్వలోకకృత్,
పవిత్రం త్రికకున్మంత్రః కనిష్ఠః కృష్ణపింగళః. 103
బ్రహ్మదండ వినిర్మాతా శతఘ్నీ పాశశక్తిమాన్,
పద్మగర్భో మహాగర్భో బ్రహ్మగర్భో జలోద్భవః 104
గభస్తిర్బ్రహ్మకృద్బ్రహ్మీ బ్రహ్మవిద్బ్రాహ్మణో గతిః,
అనంతరూపో నైకాత్మా[1] తిగ్మతేజా స్స్వయంభువః. 105
ఊర్ధ్వగాత్మా పశుపతి ర్వాతరంహా మనోజవః,
చందనీ పద్మనాళాగ్ర స్సురభ్యుత్తరణో నరః, 106
కర్ణికారమహాస్రగ్వీ నీలమౌళిః పినాకభృత్,

1 పక్షైకాత్మా.

ఉమాపతి రుమాకాంతో జాహ్నవీభృదుమాధవః. 107
వరోవరాహో వరదో వరేణ్య స్సుమహాస్వనః,
మహాప్రసాదో దమనః శత్రుహా శ్వేతపింగళః. 108
ప్రీతాత్మా పరమాత్మా చ ప్రయతాత్మా ప్రధానధృత్,
సర్వపార్శ్వముఖస్త్ర్యక్షో ధర్మసాధారణో వరః. 109
చరాచరాత్మా సూక్ష్మాత్మా అమృతో గోవృషేశ్వరః,
సాధ్యర్షి ర్వసురాదిత్యో వివస్వాన్ సవితాఽమృతః. 110
వ్యాసస్సర్గస్సుసంక్షేపో విస్తరః పర్యయో నరః,
ఋతు స్సంవత్సరో మాసః పక్షస్సంఖ్యాసమాపనః. 111
కళా కాష్ఠా లవా మాత్రా ముహూర్తాహః క్షపాః క్షణాః,
విశ్వక్షేత్రం ప్రజాబీజం లింగమాద్య [2]స్తుతి ర్గమః. 112
సదసద్వ్యక్త మవ్యక్తం పితా మాతా పితామహః,
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్, 113
నిర్వాణం హ్లాదనంచైవ బ్రహ్మలోకః పరాగతిః,
దేవాసురవినిర్మాతా దేవాసురపరాయణః. 114
దేవాసురగురుర్దేవో దేవాసురనమస్కృతః,
దేవాసుర మహామాత్రో దేవాసురగణాశ్రయః. 115
దేవాసురగణాధ్యక్షో దేవాసురగణాగ్రణీః,
దేవాదిదేవోదేవర్షి ర్దేవాసురవరప్రదః. 116
దేవాసురేశ్వరో విశ్వో దేవాసురమహేశ్వరః,

2 స్సునిర్గమః

సర్వదేవమయోఽచింత్యో దేవతాత్మాత్మసంభవః, 117
ఉద్భిత్త్రివిక్రమో వైద్యో విరజో నీరజోఽమరః,
ఈడ్యో హస్తీశ్వరో వ్యాఘ్రో దేవసింహో నరర్షభః. 118
విబుధోఽగ్రవరస్సూక్ష్మ స్సర్వదేవ స్తపోమయః,
సుయుక్తః శోభనో వజ్రీ ప్రాసానాం ప్రభవోఽవ్యయః. 119
గుహః కాన్తో నిజస్సర్గః పవిత్రం సర్వపావనః,
శృంగీ శృంగప్రియో బభ్రూ రాజరాజో నిరామయః. 120
అభిరామ స్సురగణో విరామస్సర్వసాధనః,
లలాటాక్షో విశ్వదేవో హరిణో బ్రహ్మవర్చసః. 121
స్థావరాణాం పతిశ్చైవ నియమేంద్రి యవర్ధనః,
సిద్ధార్థస్సిద్ధభూతార్థోఽచింత్యస్సత్య వ్రతశ్శుచిః. 122
వ్రతాధిపః పరం బ్రహ్మ భక్తానుగ్రహకారకః,
విముక్తో ముక్తతేజాశ్చ శ్రీమాన్ శ్రీవర్ధనో జగత్. 123
యథా ప్రధానం భగవా నితి భక్త్యా స్తుతో మయా,
యం న బ్రహ్మాదయోదేవా విదు స్తత్వేన నర్షయః. 124
స్తోతవ్య మర్చ్యం వంద్యం చ క స్తోష్యతి జగత్పతిమ్,
భక్త్యాత్వేవం పురస్కృత్య మయో యజ్ఞపతి ర్విభుః. 125
తతోఽభ్యనుజ్ఞాం సంప్రాప్య స్తుతో మతిమతాంవరః,
శివమేభిః స్తువన్ దేవం నామభిః పుష్టివర్ధనైః. 126
నిత్యయుక్త శ్శుచిర్భూతః ప్రాప్నోత్యా త్మానమాత్మనా,
ఏతది పరమం బ్రహ్మ పరం బ్రహ్మాధిగచ్ఛతి. 127

ఋషయశ్చైవదేవాశ్చ స్తువంత్యేతేన తత్పరాః,
స్తూయమానో మహాదేవ స్తుష్యతే నియతాత్మభిః. 128
భక్తానుకంపీ భగవానాత్మ సంస్థాకరో విభుః,
తథైవ చ మనుష్యేషు యే మనుష్యాః ప్రధానతః. 129
ఆస్తికా శ్శ్రద్దధానాశ్చ బహుభి ర్జన్మభి స్తవైః,
భక్త్యా హ్యనన్యమీశానం పరం దేవం సనాతనమ్. 130
కర్మణా మనసా వాచా భావేనా మితతేజసః,
శయానా జాగ్రమాణాశ్చ వ్రజన్ను పవిశం స్తథా. 131
ఉన్మిషన్ని మిషంశ్చైవ చింతయంతః పునః పునః,
శృణ్వంతశ్శ్రావయంతశ్చ కథయంతశ్చ తే భవమ్. 132
స్తువంతస్తూయమానాశ్చ తుష్యంతి చ రమంతి చ,
జన్మకోటిసహస్రేషు నానాసంసారయోనిషు. 133
జంతో ర్విగతపాపస్య భవేభ క్తిః ప్రజాయతే,
ఉత్పన్నా చ భవేభక్తి రనన్యా సర్వభావతః. 134
భావినః కారణం చాస్య సర్వము క్తస్య సర్వదా,
ఏతద్దేవేషు దుష్ప్రాపం మనుష్యేషు న లభ్యతే. 135
నిర్విఘ్నా నిర్మలా రుద్రే భక్తి రవ్యభిచారణీ,
తస్యైవచ ప్రసాదేన భక్తి రుత్పద్యతే నృణామ్. 136
యేన యాంతి పరాం సిద్ధిం తద్భావగతచేతసః,
యే సర్వభావానుగతాః ప్రపద్యంతే మహేశ్వరమ్. 137
ప్రపన్న వత్సలో దేవస్సంసారా ర్తాన్సముద్ధరేత్,

ఏవమన్యే న కుర్వంతి దేవా స్సంసారమోచనమ్. 138
మనుష్యాణామృతే దేవం నాన్యా శక్తి స్తపోబలమ్,
ఇతి తేనేంద్రకల్పేన భగవాన్ సదసత్పతిః, 139
కృత్తివాసా స్తుతః కృష్ణ తండినా శుభబుద్ధినా,
స్తవ మేతం భగవతో బ్రహ్మా స్వయమధారయత్. 140
గీయతే చ స బుద్ధ్యేత బ్రహ్మా శంకరసన్నిధౌ,
ఇదం పుణ్యం పవిత్రంచ సర్వదా పాపనాశనమ్. 141
యోగదం మోక్షదం చైవ స్వర్గదం తోషదం తథా,
ఏవ మేత త్పఠంతే య ఏకభక్త్యా తు శంకరే. 142
యా గతి స్సాంఖ్యయోగానాం వ్రజంతే తాం గతిం తథా,
స్తవ మేనం ప్రయత్నేన సదా రుద్రస్య సన్నిధౌ, 143
అబ్దమేకం చరేద్భక్తః ప్రాప్నుయాదీప్సితం ఫలమ్,
ఏతద్రహస్యం పరమం బ్రహ్మణో హృది సంస్థితమ్. 144
బ్రహ్మా ప్రోవాచ శక్రాయ శక్రః ప్రోవాచ మృత్యవే,
మృత్యుః ప్రోవాచ రుద్రేభ్యోరుద్రేభ్య స్తండిమాగమత్. 145
మహతా తపసాప్రాప్తం తండినా బ్రహ్మసద్మని,
తండిఃప్రోవాచ శుక్రాయ గౌతమాయ చ భార్గవః. 146
వైవస్వతాయ మనవే గౌతమః ప్రాహమాధవ,
నారాయణాయసాధ్యాయ మనురిష్టాయధీమతే. 147
యమాయ ప్రాహ భగవాన్ సాధ్యో నారాయణోఽచ్యుతః,
నాచికేతాయ భగవా నాహ వైవస్వతో యమః. 148

మార్కండేయాయ వార్ష్ణేయ నాచికేతోఽభ్యభాషత,
మార్కండేయాన్మయా ప్రాప్తో నియమేన జనార్దన. 149
తవాప్యహ మమిత్రఘ్న స్తవం దద్యాం హ్యావిశ్రుతమ్,
స్వర్గ్య మారోగ్యమాయుష్యం ధన్యం వేదేన సంమితమ్. 150
నాస్య విఘ్నం వికుర్వంతి దానవా యక్షరాక్షసాః,
పిశాచా యాతుధానా వా గుహ్యకా భుజగా అపి. 151
యః పఠేత శుచిః పార్థ బ్రహ్మచారీ జితేంద్రియః,
అభగ్న యోగో వర్షంతు సోఽశ్వమేధఫలం లభేత్. 152

ఇతి శ్రీమన్మహాభారతే ఆనుశాసనికపర్వణి
శ్రీ శివసహస్రనామస్తోత్రరత్న కథనం నామ సప్తదశోఽధ్యాయః



# శివ సహస్రనామ అర్థ వివరణము

శ్లో॥ స్థిరః స్థాణుః ప్రభుర్భీమః । ప్రవరోవరదోవరః
సర్వాత్మా సర్వ విఖ్యాతః ।సర్వః సర్వకరోభవః।

స్థిర ః - చాంచల్యము లేనివాడు 1

స్థాణు ః - గృహ స్తంభమువలె సర్వాశ్రయుడు 2

ప్రభు ః - ఉత్కృష్టమైన యునికి కలవాడు 3

భీమ ః - సంహారకుడు 4

ప్రవర ః - భోగమోక్షములను కోరువారిచేత కోరబడు వాడు, లేక, శ్రేష్ఠుడు 5

వరద ః - కోరిన కోరికల నొసంగువాడు. 6

వర ః - సమస్తమును ఆచ్ఛాదించి యుండువాడు 7

సర్వాత్మా - సమస్త ప్రాణుల అంతరాత్మయైనవాడు జీవ రూపమున అంతట వ్యాపించినవాడు 8

సర్వవిఖ్యాత ః - అన్ని ప్రదేశములందును, అన్ని కాలములందును, అన్ని ప్రాణులందును ప్రసిద్ధమైనవాడు 9

సర్వ ః - వ్యాపకుడు 10

సర్వకర ః - సర్వమును చేయువాడు, లేక, విశ్వకర్త 11

భవ ః - సమస్తమునకు సృష్టినిలయములను చేయువాడు 12

శ్లో॥ జటీ చర్మీ శిఖండీ చ । సర్వాంగః సర్వభావనః
హరిశ్చ హరిణాక్షశ్చ । సర్వభూత హరః ప్రభుః 2

జటీ - కేశసంఘాతము జట. అట్టిజటలు కలవాడు 13
చర్మీ - వ్యాఘ్రముయొక్క లేక గజము యొక్క
చర్మము కలవాడు 14
శిఖండీ - జటాగ్ర పుచ్ఛము కలవాడు 15
సర్వాంగః - సమస్తలోకము అవయవముగా కలవాడు 16
సర్వభావనః - విశ్వకర్త 17
హరః - సర్వమును సంహరించువాడు 18
హరిణాక్షః - మృగనేత్రుడు 19
సర్వభూతహరః - సర్వభూతములను సంహరించువాడు 20
ప్రభుః - విశ్వమును భోగ్యవస్తువుగా పొందువాడు
అనగా సర్వభోక్త 21

శ్లో॥ ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ।నియతః శాశ్వతో ధ్రువః
శ్మశానవాసీ భగవాన్ । ఖచరోగోచరోర్దనః 3

ప్రవృత్తిః - ప్రకర్షమైన వర్తనుడు 22
నివృత్తిః - నిర్వ్యాపారత్వముతో నుండువాడు 23
నియతః - వశముచేసికొన్న ఇంద్రియములు కలవాడు 24
శాశ్వతః - నిత్యుడు 25
ధ్రువః - అచలుడు 26
శ్మశానవాసీ - వారణాసియందు నివసించుస్వభావము
కలవాడు 27

భగవాన్ - 1 సమగ్రమగు నైశ్వర్యము 2 జ్ఞానము 3 యశము 4 శ్రీ 5 వైరాగ్యము 6 ధర్మము అను ఆరింటికి భగమనిపేరు, అట్టిభగము 6 గుణములు కలవాడు 28

ఖచరః - హృదయాకాశ చరుడు 29

గోచరః - సర్వాత్మయగుటవలన సర్వేంద్రియగమ్యుడు లేక ఇంద్రియములద్వారా విషయసుఖములను యనుభవించువాడు 30

అర్దనః - కాలాంతకుని రూపమున పాపిని బాధించువాడు 31

**శ్లో॥ అభివాద్యో మహాకర్మా । తపస్వీభూతభావనః**
**ఉన్మత్తవేషప్రచ్ఛన్నః । సర్వలోకప్రజాపతిః 4**

అభివాద్యః - అందరిచేత నమస్కరింపదగువాడు లేక స్తుతింపదగువాడు 32

మహాకర్మా - మహత్తరమైన సృష్ట్యాదికర్మము కలవాడు 33

తపస్వీ - తపమే ధనముగా కలవాడు 34

భూతభావనః — ఆకాశాదిభూతములను సంకల్పమాత్రము చేత సృజించువాడు 35

ఉన్మత్తవేషప్రచ్ఛన్నః — దిగంబరత్వాది వేషములవలన తెలియుటకు సాధ్యముకానివాడు 36

సర్వలోక ప్రజాపతిః - లోకములనగా స్థానములు.

ప్రజలనగా స్థానములందుండు ప్రాణులు. అట్టిప్రాణు
లకుస్వామి 37

శ్లో॥ మహారూపో మహాకాయో।వృషరూపోమహాయశాః
మహాత్మా సర్వభూతాత్మా। విశ్వరూపోమహాహనుః

మహారూపః - మహత్తరమైన అఖండమైన రూపము
కలవాడు 38

మహాకాయః – మహత్తరమైన స్థూలరూపము కలవాడు 39

వృషరూపః - (వృషమనగా ధర్మము) ధర్మరూపుడు 40

మహాయశాః - మహత్తరమగు యశస్సుకలవాడు 41

మహాత్మా - గొప్పమనస్సుకలవాడు 42

సర్వభూతాత్మా - సర్వభూతములు సంకల్ప (మనస్సు)
మాత్రముగా కలవాడు 43

విశ్వరూపః - విశ్వము రూపముగా కలవాడు లేక విశ్వ
మున ప్రకటింపబడువాడు 44

మహాహనుః - ప్రపంచమును మ్రింగుటకు సమర్థమగు
గొప్పదవడలు (ముఖఫలకములు) కలవాడు. 45

శ్లో॥ లోక పాలో న్తర్హి తాత్మా । ప్రసాదోహయగర్దభిః
పవిత్రంచ మహాంశ్చైవ। నియమోనియ మాశ్రితః

లోకపాల ః - ఇంద్రాది లోకపాల స్వరూపుడు 46

అన్తర్హితాత్మాః - రజ్జు సర్పభ్రాంతివలె అవిద్యచే

కల్పితమైనఅహంకారాదికముచేత మరుగుపడిన
అఖండైకరసస్వభావుడు 47
ప్రసాదః - ఆనందుడు. 48
హయగర్దభిః - అగ్నిరూపుడగుదేవుడు (రథమునందున్న
పరమేశ్వరుని) అశ్వములు (గర్దభములు)మోయును. 49
పవిత్రం - సంసార ప్రజపాతమునుండి రక్షించువాడు 50
మహాన్ — పూజ్యుడు 51
నియమః — శౌచము సంతోషము తపము స్వాధ్యాయము
ఈశ్వరప్రణిధానము అనెడి నియమములతో పొంద
బడువాడు 52
నియమాశ్రితః — నారాయణ దక్షిణామూర్త్యాది రూప
ములతో నియమముల కాశ్రయమైనవాడు 53

శ్లో॥ **సర్వకర్మా స్వయం భూత। ఆదిరాది కరోనిధిః**
**సహస్రాక్షో విశాలాక్షః। సోమో నక్షత్రసాధకః7**

సర్వకర్మా - సమస్త శిల్పాచార్యుడగు విశ్వకర్మ 54
స్వయంభూతః - నిత్యసిద్ధుడు 55
ఆదిః — అన్నింటికిని ప్రథముడు. 56
ఆదికరః - హిరణ్యగర్భుని సృష్టించినవాడు. 57
నిధిః — పద్మము శంఖము మున్నగు రూపము కల అక్ష
యమైన ఐశ్వర్యము కలవాడు 58
సహస్రాక్షః - అనంతమైన కరచరణాదులు కలవాడు

లేక ఇంద్రస్వరూపుడు 59

విశాలాక్షః - విపులమైన ఇంద్రియములు కలవాడు 60

సోమః — చంద్రుడు లేక లతారూపమైన యజ్ఞహవిస్సు 61

నక్షత్రసాధకః - పుణ్యాత్ముల ప్రకాశమానములగు నక్షత్రముల రూపమున గోచరించు శరీరములను సాధించువాడు. 62

శ్లో॥ చంద్రః సూర్యః శనిః కేతుః । గ్రహో గ్రహపతిర్వరః
అత్రిరత్ర్యానమస్కర్తా ।మృగబాణార్పణోనఘః 8

చంద్రః — చంద్రస్వరూపుడు 63

సూర్యః — సూర్యస్వరూపుడు 64

శనిః — శని స్వరూపుడు 65

కేతుః - కేతుస్వరూపుడు 66

గ్రహః - సూర్య చంద్రులను గ్రసించురాహువు. 67

గ్రహపతిః — గ్రహములకు పతి (క్రూరుడగుటవలన మంగళుడు) 68

వరః - వరింపదగువాడు పూజ్యుడు. బృహస్పతియే శుక్రుడు 69

అత్రిః - అత్రిగోత్ర సముద్భవుడగు బుధుడు 70

అత్ర్యాః నమస్కర్తా - అత్రి పత్నియగు అనసూయకు మొక్కువాడు దత్తదుర్వాసోరూపము పుత్రుడగుట

వలన అనసూయకు ప్రమొక్కాను 71

మృగబాణార్పణః- మృగరూపముదాల్చిన యజ్ఞమున
బాణము ప్రయోగించువాడు 72

అనఘః - యజ్ఞధ్వంసియైనను పాపరహితుడు 73

**శ్లో॥ మహాతపా ఘోరతపో అదీనో దీనసాధకః**
**సంవత్సరకరోమంత్రః।ప్రమాణం పరమంతపః 9**

మహాతపాః - విశ్వసృష్టికి సమర్థమైన గొప్పతపము
అనగా ఆలోచనకలవాడు 74

ఘోరతపాః - విశ్వసంహార సమర్థమగు భయంకరమగు
తపముకలవాడు. 75

అదీనః - మహామనస్సు కలవాడు సుగ్రీవుడు విభీషణుడు
మున్నగువారు ప్రమొక్కినమాత్రమున రాజ్య
మొసంగినవాడు. 76

దీనసాధకః - శరణుపొందిన దీనులకోరికలను
సాధించువాడు 77

సంవత్సరకరః- సంవత్సరకర్తకాలచక్ర ప్రవర్తకుడు ధ్రువాది
జ్యోతిర్గణ రూపుడు 78

మంత్రః- మననము వలనరక్షించు ప్రణవాదిరూపమైనవాడు 79

ప్రమాణంః - వేదశాస్త్రాదిరూపము 80

పరమంతపః - ఉత్కృష్టమగు తపముకలవాడు 80
ఆత్మదర్శనము కలిగించునదియే పరమధర్మము
పరమతపము 81

శ్లో॥ యోగీ యోజ్యో మహాబీజో ।మహారేతా మహాబలః
సువర్ణరేతా స్సర్వజ్ఞః । సుబీజో బీజవాహనః 10

యోగీః - యోగనిష్ఠుడు 82

యోజ్యః - బ్రహ్మమున కూడదగువాడు 83

మహాబీజః - కారణమునకును కారణుడు. 84

మహారేతః - అవ్యక్తమునకుస్ఫూర్తినొసంగు రేతము అనగా ప్రతిబింబము కలవాడు 85

మహాబలః - ఉత్కృష్టమగు సామర్థ్యము కలవాడు 86

సువర్ణరేతాః - హిరణ్మయ బ్రహ్మాండమును సృజించిన వాడులేక అగ్నిరూపముతో సువర్ణరేతస్సు కలవాడు. 87

సర్వజ్ఞ - మాయావృత్తిచే సర్వమునెరింగినవాడు 88

సుబీజః - సర్వకారణుడు 89

బీజవాహనః - అవిద్యాకామ కర్మాత్మకమగుబీజమే వాహనముగాచేసికొని ఇహపరలోకములు సంచరించువాడు. 90

శ్లో॥ దశబాహుస్త్వనిమిషో । నీలకంఠ ఉమాపతిః
విశ్వరూపః స్వయంశ్రేష్ఠో।బలవీరో బలోగణః 11

దశబాహుః - పదిబాహువులు కలవాడు 91

అనిమిష - క్షణముకూడ దృగ్లోపము( రెప్పపాటు)లేనివాడు 92

నీలకంఠః - ముల్లోకములను వ్యాపించు హాలాహలమును కంఠమున దాల్చుటవలన నీలమైన కంఠము గలవాడు పరమకారుణికుడని భావము 93

ఉమాపతిః — హైమవతియని కేనోపనిషత్తునందు ప్రసిద్ధ మైన బ్రహ్మవిద్యయే ఉమ అట్టి ఉమకు పతి అనగా బ్రహ్మవిద్యా ప్రదాతలేక పార్వతీపతి 94

విశ్వరూపః - రూపములు జనించుటకు కారణమైనవాడు 95

స్వయంశ్రేష్ఠః - స్వతస్సిద్ధమైన శ్రేష్ఠత్వము కలవాడు 96

బలవీరః- బలముచేత విక్రమించిన వీరుడు త్రిపుర సంహారాది అనన్యసాధ్యములగు కర్మలుచేయువాడు 97

అబలోగణః- సామర్థ్యము వీనితత్త్వములు(యిరువైయైదు) కలవాడు 98

శ్లో॥ గణకర్తా గణపతి। ర్దిగ్వాసాః కామఏవచ
మంత్ర విత్పరమోమంత్రః।సర్వభావకరోహరః 12

గణకర్తా - అట్టి గణములకుకర్త లేకనియంత 99

గణపతిః - గణములకధిపతి 100

దిగ్వాసాః - దిగంబరుడులేక అనంతమగు దిక్కుల కప్పువాడు 101

కామః - మన్మథుడు లేక కోరిక అను రూపము కలవాడు 102

మంత్రవిత్ - ఇషేత్వాది వేదమంత్రములను పాఠరూపమున అర్థరూపమున ఎఱిగినవాడు లేక అట్టి మంత్రములచేత తెలియదగువాడు 103

పరమోమంత్రః — ఆత్మతత్త్వాలోచన రూపమైన విచారము కలవాడు 104

సర్వభాసకర ః - జగత్కారణుడు. 105

హర ః - తత్త్వజ్ఞానము వలన కారణకార్యనాశనము చేయువాడు అనగా పునర్జన్మలేని మోక్షము నొసంగువాడు 106

శ్లో॥ కమండలు ధరో ధన్వీ । బాణహస్తః కపాలవాన్
అశనీ శతఘ్నీ ఖడ్గీ । పట్టిశీచాయు ధీమహాన్ 13

దశబాహువని చెప్పిన బాహువుల ఆయుధములను పేర్కొను చున్నాడు

కమండలుధర ః - కమండలువుదాల్చువాడు. 107

ధన్వీ - ధనుష్మంతుడు 108

బాణహస్త ః - బాణములు హస్తమున కలవాడు 109

కపాలవాన్ — బ్రహ్మ శిరస్సును ఖండించి కపాలము దాల్చువాడు 110

అశనీ - వజ్రము కలవాడు 111

శతఘ్నీ - శక్త్యాయుధము కలవాడు 112

ఖడ్గీ - ఖడ్గము కలవాడు 113

పట్టిశీ — పట్టిశమను ఖడ్గము కలవాడు 114

ఆయుధీ - అసాధారణమైన శూలాయుధము కలవాడు. 115

మహాన్ - పూజ్యుడు. 116

శ్లో॥ స్రువహస్తః సురూపశ్చ । తేజస్తేజస్కరోనిధిః
ఉష్ణీషీచ సువక్త్రశ్చ । ఉదగ్రో వినతస్తథా 14

సుశ్రవహస్తః - యజ్ఞపాత్రమగుస్రువముహస్తమున
కలవాడు 117
సురూపః - శోభనమైన రూపము కలవాడు 118
తేజః - తేజస్సు కలవాడు 119
తేజస్కరోనిధిః- భక్తులకు కాంతిప్రదమైన నిధివంటివాడు 120
ఉష్ణీషీః - శిరోవేష్టనము (తలపాగా) కలవాడు 121
సువక్త్రః - మంచిముఖము కలవాడు 122
ఉదగ్రః – ఊర్జితమైన రూపము కలవాడు. 123
వినతః - వినయము కలవాడు 124

శ్లో॥ దీర్ఘశ్చ హరికేశశ్చ। సుతీర్థః కృష్ణ ఏవచ
సృగాలరూపః సిద్ధార్థో। ముణ్డో సర్వశుభంకరః 15

దీర్ఘః - మిగుల ఉన్నతుడు 125
హరికేశః - ఇంద్రియములే కిరణములుగా కలవాడు
లేక ఇంద్రియములద్వారా అర్థములను ప్రకా
శింపజేయువాడు లేక త్రిమూర్తిస్వరూపుడు 126
సుతీర్థః - శోభనుడు తీర్థుడు లేక మహాగురువు లేక
ఈశ్వరవాచకమైన ప్రణవము పూర్వులకుకూడగురువు 127
కృష్ణః - ఆనందరూపుడగు వాసుదేవుడు మహాదేవుని
యవతారమే కృష్ణుడు 128
సృగాలరూపః-వణిజునిచే నవమానింపబడిన బ్రాహ్మణుడు
ప్రాయోపవేశముచేయగా ఇంద్రుడు సృగాల (నక్క)
రూపముదాల్చెను కావున ఇంద్రునకు

వేరుకానివాడు 129

సిద్ధార్థః - సిద్ధించిన అర్థములు కలవాడు 130

ముండః — పరివ్రాజకుడు 131

సర్వశుభంకరః - సర్వభూతములకభయమొసంగువాడు 132

శ్లో॥ అజశ్చ బహురూపశ్చ। గన్ధధారీ కపర్ద్యపి
ఊర్ధ్వరేతా ఊర్ధ్వలింగ। ఊర్ధ్వశాయీ నభస్థలః 16

అజః - పుట్టనివాడు 133

బహురూపః - బహురూపములు కలవాడు 134

గన్ధధారీ-కుంకుమ కస్తూర్యాది సుగంధద్రవ్యములు
ధరించువాడు 135

కపర్ది — జలమును పానము చేయుచూ తపము ఐశ్వర్య
ప్రదమైన బుద్ధము కలవాడు 136

ఊర్ధ్వరేతాః - అస్ఖలిత బ్రహ్మచారి 137

ఊర్ధ్వలింగః - ఊర్ధ్వలింగము కలవాడు 138

ఊర్ధ్వశాయీ - వెల్లకిల పరుండువాడు (ఊర్ధ్వరేతుడు
ఊర్ధ్వలింగుడు ఊర్ధ్వశాయీఅను పదముల వలన శివుడు
మాగ్రస్తుడు ఉమాస్పృష్టుడు కాలేదని భావము 139

నభస్థలః - నభశ్శబ్దముచే చెప్పబడుశక్తికి
నివాసమైనవాడు 140

శ్లో॥ త్రిజటీ చీరవాసాశ్చ। రుద్రః సేనాపతిర్విభుః
అహశ్చరోనక్తంచర। స్తిగ్మమన్యుః సువర్చసః 17

త్రిజటీ - మూడుజడలుకలవాడు 141

చీరవాసాః - నారబట్టలు దాల్చువాడు 142

రుద్రః - అందరికి ప్రాణరూపుడు 143

సేనాపతిః - సైన్యాధిపతి 144

విభుః - వ్యాపకుడు 145

అహశ్చరః - దేవతలకాది 146

నక్తంచరః - రక్కసులకాది - 147

తిగ్మమన్యుః - తీవ్రమగు కోపముకలవాడు 148

సువర్చసః- అధ్యయనము తపము మున్నగువాని వలన
కలిగిన తేజమధికముగా కలవాడు. 149

శ్లో॥ గజహా దైత్యహాకాలో । లోక ధాతాగుణాకరః
సింహశార్దూల రూపశ్చ।ఆర్ద్రచర్మాంబరావృతః 18

గజహా – గజాసురుని చంపిన వాడు 150

దైత్యహా - దైత్యుని చంపినవాడు 151

కాలః - మృత్యువు లేక సంవత్సరాది కాలము 152

లోకధాతా - లోకముల కీశ్వరుడు 153

గుణాకరః - దీనదయాళుత్వము జ్ఞానైశ్వర్యాదులకు
నిలయమైనవాడు- 154

సింహశార్దూలరూపః– సింహము శార్దూలము మున్నగు
క్రూరజంతు స్వరూపుడు 155

అర్ద్రచర్మాంబరావృతః- తడిగజ చర్మముచే కప్పబడిన
వాడు. 156

శ్లో॥ కాలయోగీ మహానాదః । సర్వకామశ్చతుష్పథః
నిశాచరః ప్రేతచారీ । భూతచారీ మహేశ్వరః 19

కాలయోగీ – కాలము అను (కాలుని) వంచించుయోగి అనగా మృత్యుంజయుడు 157

మహానాదః – హంసోపని షత్ప్రసిద్ధమైన అనాహతధ్వని రూపుడు. 158

సర్వకామః – సమస్తమైన కోరికలు తనయందు కలవాడు 159

చతుష్పథః – ఉపాసనకై నాల్గు మార్గములు కలవాడు 160

నిశాచరః – భేతాళాది రూపుడు 161

ప్రేతచారీ – భూతములతో తిరుగువాడు 162

భూతచారీ – భూతములతో తిరుగువాడు 163

మహేశ్వరః – ఇంద్రాదీశ్వరుల కంటె గొప్పవాడు 164

శ్లో॥ బహుభూతో బహుధరః । స్వర్భానురమితోగతిః
నృత్యప్రియో నిత్యనర్తో । నర్తక స్సర్వలాలసః 20

బహుభూతః – మొదట నొకడే యైనను బహురూపులుగా నయినవాడు 165

బహుధరః – గొప్పప్రపంచమును దాల్చువాడు 166

స్వర్భానుః – అజ్ఞాన తమముచే చెప్పబడురాహువు 167

అమితః – అంతములేని వాడు 168

గతిః – ముక్తులకు పొంద దగువాడు 169

నృత్యప్రియః - తాండవప్రియుడు 170
నిత్యనర్తః - నిరంతరము నర్తనముచేయువాడు 171
నర్తకః - నర్తనము చేయువాడు 172
సర్వలాలసః - అందరి యందును ప్రీతిగల విశ్వబంధువు 173

శ్లో॥ ఘోరో మహా తపాః పాశో । నిత్యోగిరిరుహోనభః
సహస్రహస్తో విజయో । వ్యవసాయో హ్యతం
ద్రితః 21

ఘోరః - ఆకలి దప్పి మున్నగు ఘోరతనువు సంతో
షాది తనువు అను రెండు రూపములు కలవాడు 174
మహాతపాః - సృష్టి సంహార సమర్థమైన గొప్పతపము
అనగా ఆలోచన కలవాడు 175
పాశః - తనమాయచేత బంధించువాడు 176
నిత్యః - ధ్వంసరహితుడు 177
గిరిరుహః - కైలాసవాసి 178
నభః - ఆకాశము వంటి దేహముకలవాడు 179
సహస్రహస్తః - అనేక హస్తములుములు కలవాడు 180
విజయః - విజయ స్వరూపుడు 181
వ్యవసాయః - జయహేతువు 182
తంద్రితః - తమోమయ ప్రవృత్తిలేనివాడు 183

శ్లో॥ అఘర్షణో ఘర్షణాత్మా । యజ్ఞహా కామనాశకః
దక్షయా గాపహారీచ । సుసహోమధ్యమస్తథా 22

అఘర్షణః - కదలింపరానివాడు 184
ఘర్షణాత్మా ః - భయరూపుడు 185
యజ్ఞహా - బౌద్ధావతారమున యజ్ఞములను నశింప
జేసినవాడు 186
కామనాశకః — స్మరుని సంహరించినవాడు లేక భక్తుల
కామములు దీర్చుట వలన ఇచ్ఛ నశింపజేయువాడు 187
దక్షయాగాపహారీః - దక్షుని యజ్ఞమును ధ్వంస మొన
రించినవాడు 188
సుసహః- సౌమ్యుడు 189
మధ్యమః- కొంచెము సౌమ్యుడు 190

శ్లో॥ తేజోపహారీ బలహా । ముదితోర్థోజితోవరః
గంభీర ఘోషోగంభీరో । గంభీరబలవాహనః 29

తేజోపహారీః - అతిక్రూరుడు 191
బలహాః - ఇంద్రరూపమున బలాసురుని చంపినవాడు 192
ముదితః- నిత్యానందయుక్తుడు 193
అర్థః - ధన రూపమున అర్థింపదగు వాడు 194
అజితః - కృష్ణ బాణాసురుల యుద్ధమున శివాజ్ఞతోనే
శివుడుజయింపబడెను కాని స్వబలముచేత కాదు. 195
అవరః - తనకంటె వేరుగా కోరదగు వాడులేనివాడు 196
గంభీరఘోషః- దుందిభి సముద్రాదిరూపమునగంభీర
ఘోష కలవాడు 197
గంభీరః - తాత్పర్యుడగు వేదస్వరూపుడు 198

గంభీరవాహనః- అగాధ ధర్మ స్వరూపమైన వృషభము వాహనముగా కలవాడు. 199

శ్లో॥ న్యగ్రోధరూపో న్యగ్రోధో । వృక్ష కర్ణస్థితిర్విభుః
సుతీక్ష్ణదశనశ్చైవ । మహాకాయో మహాననః 24

న్యగ్రోధరూపః- సంసారవృక్ష స్వరూపుడు 200

న్యగ్రోధః - వటరూపుడు అనగా వటవృక్ష సమీపమున దక్షిణామూర్తి రూపమున నున్న వాడనిభావము 201

వృక్షకర్ణస్థితిః -వటపత్ర శాయియగు బాలముకుందరూపుడు202

విభుః - భక్తుల నను గ్రహించుటకై హరి హర దుర్గా గణపతి అర్క అగ్ని వాయ్వాది బహు రూపముల విలసిల్లువాడు 203

సుతీక్ష్ణదశనః - సమర్థమైన తీక్ష్ణమైన దంతములు కలవాడు 204

మహాకాయః - గొప్పదగు కాయము కలవాడు 205

మహాననః - గొప్పముఖము కలవాడు 206

శ్లో॥ విష్వక్సేనోహరిర్యజ్ఞః । సంయుగా పీడవాహనః
తీక్ష్ణతపశ్చ హర్యశ్వః । సహాయః కర్మకాలవిత్ 25

విష్వక్సేనః - దర్శన మాత్రమున అన్ని వైపులకు పారిపోవుదైత్యసేన కలవాడు లేక అంతట పూజింపబడు సైన్యము కలవాడు. 207

హరిః - గజేంద్ర మోక్షణ సమయమున ఆపదను హరించిన

వాడు లేక సర్వ సంహారకుడు. 208

యజ్ఞః - సృష్టికి బీజభూతుడు 209

సంయుగా పీడవాహనః — యుద్ధమున ధ్వజముగా చేసి కొన్న వృషభము వాహనముగా కలవాడు వృష రూపవాహనమే ధ్వజమని భావము 210

తీక్ష్ణతాపః - అగ్నిరూపుడు 211

హర్యశ్వః - అతి వేగముగా పోవు అశ్వములుకల సూర్యరూపుడు 212

సహాయః - జీవునకు సఖుడు 213

కర్మకాలవిత్ — కర్మలను దర్శాది కాలములను శాస్త్రోక్తవిధి నెరింగినవాడు. 214

శ్లో॥ విష్ణుప్రసాదితోయజ్ఞః ॥ సముద్రోబడబాముఖః
హుతాశన సహాయశ్చ । ప్రశాంతాత్మహుతాశవః

విష్ణుప్రసాదితః - చక్రిలాభమునకై విష్ణువుచేత ప్రసన్నునిగా చేసికొన బడినవాడు. 215

యజ్ఞః - విష్ణుస్వరూపుడు 216

సముద్రః — సముద్రరూపుడు 217

బడబాముఖః - సముద్ర జలమును నిత్యము శోషింపజేయు అగ్ని రూపుడు. 218

హుతాశనసహాయః - అగ్నికి సఖుడగు వాయువు 219

ప్రశాంతాత్మా - కెరటములులేని సాగరముయొక్క స్వరూపుడు 220

హుతాశనః - అగ్నిరూపుడు. 221

శ్లో॥ ఉగ్రతేజామహాతేజా । జన్యోవిజయ కాలవిత్
జ్యోతిషామయనం సిద్ధిః । సర్వవిగ్రహఏవచ 27

ఉగ్రతేజా ః- సహింపరాని స్పర్శకలవాడు 222
మహాతేజా ః- విశ్వప్రకాశుడు 223
జన్య ః- సంగ్రామమున సాధువు 224
విజయకాలవిత్ - విజయకాలమునెరిగినవాడు విజయ కాలము నెరుగనిచో శూరుడైనను పరాజితుడు కాగలడు. 225
జ్యోతిషామయనం - గ్రహనక్షత్రాదుల గమనమును వర్ణించు శాస్త్రము జ్యోతిషము దాని నెరిగిన వాడు అనగా కాలరూపుడు కాలవేత్త 226
సిద్ధిః - జయరూపసిద్ధియైన వాడు. 227
సర్వవిగ్రహః - కాలాదికము సర్వము దేహముగా కలవాడు. 228

శ్లో॥ శిఖీముణ్డీ జటీజ్వాలీ । మూర్తిజోమూర్ధగోబలి
వేణ వీపణవీతాళీ । ఖలీకాల కటంకటః 28

శిఖీ - శిఖగలవాడు అనగా గృహస్థుడు. 229
ముండీ - సన్యాసి లేక నైష్ఠిక బ్రహ్మచారి 230
జటీ - జడలు కలవాడు అనగా వానప్రస్థుడు 231
జ్వాలీ — జ్వాలలు కలవాడు అర్చిరాది మార్గమైనవాడు 232

మూర్తిజః - శరీరమున ఆవిర్భవించువాడు 233

మూర్ధగః - సహస్రారమున పయనించువాడు 234

బలీ - బలవంతుడు 235

వేణలీ - వేణువు అనెడి వాద్య విశేషముకలవాడు 236

పణవీ - పణవ మనెడు వాద్య విశేషము కలవాడు 237

తాళీ — తాళమను వాద్య విశేషము కలవాడు 238

ఖలీ — ధాన్య స్థానము (కళ్ళము) కలవాడు. 239

కాలకటంకటః - ఈశ్వరమాయ నావరించియుండు వాడు. 240

శ్లో॥ నక్షత్ర విగ్రహమతిః । గుణబుద్ధిర్లయోగమః
ప్రజాపతిర్విశ్వబాహుః । విభాగ స్సర్వగోముఖః 2[illegible]

నక్షత్ర విగ్రహమతిః - గ్రహతారాది శరీరమగు కాల చక్రముననుసరించుమతి కలవాడు లేక దైవజ్ఞుడు 241

గుణ బుద్ధిః - గుణ కార్య విషయములందు బుద్ధి కల వాడు. జీవరూపి యని భావము. 242

లయః - అంతయు తన యందు లీనముచేసికొను నీశ్వరుడు. 243

అగమః - అచంచలుడు చింత్యమాత్రుడగు కూటస్థుడు 244

ప్రజాపతిః — విరాడ్రూపుడు 245

విశ్వబాహుః - విశ్వములయొక్క బాహువులేబాహువులుకలవాడు. 246

విభాగః - వేరుగా చేయబడువాడు అనగా సృష్టికార్య
రూపుడు 247
సర్వగః - సమష్టికార్యరూపుడు 248
అముఖః - భోగసాధన హీనుడు. అభోక్తృయనిభావము 249

శ్లో॥ విమోచనస్సుసరణో । హిరణ్యకవచోద్భవః
మేఢ్రజో బలచారీచ । మహీచారీస్రుతస్తథా 30

విమోచనః - సంసారమోచకుడు 250
సుసరణః - బాగుగాపొందదగువాడు 251
హిరణ్యకవచోద్భవః - హరించునది హిరణ్యము అనగా
మాయ తద్వికార భూతమగు కవచమువంటి ఆవర
ణము శరీరము. అట్టి శరీరమున ఆవిర్భవించువాడు. 252
మేఢ్రజః - లింగమున ఆవిర్భవించువాడు. 253
బలచారీ - వనచరుడు శబర వేషధారియని భావము 254
మహీచారీ - సమస్త భూమియందును చరించువాడు 255
స్రుతః - అంతట నుండువాడు. 256

శ్లో॥ సర్వతూర్యనినాదీచ । సర్వాతోద్య పరిగ్రహః
వ్యాలరూపోగుహావాసీ।గుహూమాలీ తరంగవిత్ 31

సర్వ తూర్యనినాదీ - సమస్తవాద్యముల ధ్వనులు
కలవాడు. 257
సర్వాతోద్యపరిగ్రహః - జీవులనెడి పశువులేకుటుంబ
ముగా కలవాడు పశుపతి యని భావము. 258

వ్యాలరూపః - శేషస్వరూపుడు 259

గుహావాసీ - యోగి 260

గుహః — కార్తికేయ స్వరూపుడు 261

మాలీ - వనమాల దాల్చువాడు 262

తరంగవిత్ - కెరటముల వంటి విషయ సుఖములను పొందువాడు. 263

శ్లో॥ త్రిదశ స్త్రికాల ధృక్కర్మ। సర్వబన్ధవిమోచనః
బంధనస్త్వసురేంద్రాణాం।యుధిశత్రువినాశనః 32

త్రిదశః— ప్రాణులకు జన్మస్థితినాశము లనెడి మూడు దశల నొసంగువాడు. 264

త్రికాలధృక్ - త్రికాలములయందు జనించిన వస్తు జాతమును దాల్చువాడు. 265

కర్మసర్వబన్ధవిమోచనః — కర్మలనుండియు అవిద్యా కామాత్మకములైన సర్వబంధములనుండియు విమోచనము కలిగించువాడు. 266

బంధనస్త్వసురేన్ద్రాణాం - వామనరూపమున బలికి బంధము కలిగించినవాడు (బహువచనము కల్పభేదమును సూచించును) 267

యుధిశత్రు వినాశనః— యుద్ధమున శత్రువుల నాశనము చేయువాడు. 268

శ్లో॥ సాంఖ్యప్రసాదో దుర్వాసాః।సర్వసాధునిషేవితః
ప్రస్కన్దనో విభాగజ్ఞో।అతుల్యోయజ్ఞభాగవిత్ 33

సాంఖ్యప్రసాదః - ఆత్మానాత్మ వివేకము సాంఖ్యము అట్టి సాంఖ్యము వలన అనగా జ్ఞానమువలన పొందదగువాడు లేక సాంఖ్య జ్ఞాన దాయకుడగు దత్తాత్రేయుడు. 269

దూర్వాసాః - రుద్రాంశ భవుడగు దత్తాత్రేయుని సోదరుడగు దుర్వాసుడు. 270

సర్వసాధునిషేవితః - సమస్త సజ్జనులచేత సేవింపబడువాడు బ్రాహ్మణుల ప్రభువగు చంద్రుడు. 271

ప్రస్కన్దనః - బ్రహ్మాదులను కూడ జారు (నశించు) నట్లు చేయువాడు. 272

విభాగజ్ఞః - ప్రాణులకు యథోచితమగు కర్మ ఫలములు విభజించు వాడు 273

అతుల్యః - సాటిలేనివాడు ఇక యధికు డెట్లుండును 274

యజ్ఞభాగవిత్ - యజ్ఞములందు భాగముల ముల నెరింగినవాడు 275

శ్లో॥ సర్వవాసః సర్వచారీ । దుర్వాసా వాసవోమరః
హైమో హేమకరోయజ్ఞః।సర్వధారీ ధరోత్తమః 34

సర్వవాసః - అంతటను నివాస స్థానముకలవాడు 276

సర్వచారీ - అంతటచరించువాడు 277

దూర్వాసాః - ఆర్ద్రమగు గజచర్మరూపమగు దుస్థితిలో నున్న వస్త్రము కలవాడు లేక దుర్లభమగు వస్త్రము కలవాడు. 278

వాసనః - వాసనరూపుడు 279
అమరః - నాశనములేనివాడు 280
హైమః - హిమాలయరూపి 281
హేమకరః - సువర్ణకర్త (జంబూద్వీప చిహ్నమైన (జంబూ నేరేడు వృక్షమునుండి జారిపడినపండు బంగారమగునని పురాణములందు వర్ణింపబడిన) 282
అయజ్ఞః - కర్మరహితుడు 283
సర్వధారీ - సకలకర్మ ఫలముదాల్చువాడు 284
ధరోత్తమః - దిగ్గజ శేషకూర్మాదులకంటె నుత్తముడు అనన్య ధారుడై దిగ్గజ శేషకూర్మాదులతో సహితముగా బ్రహ్మాండ మంతయు ధరించువాడు 285

**శ్లో॥ లోహితాక్షో మహాక్షశ్చ । విజయాక్షోవిశారదః**
**సంగ్రహానిగ్రహః కర్తా।సర్పచీర నివాసనః 35**

లోహితాక్షః - ఎఱ్ఱని నేత్రములు కలవాడు 286
మహాక్షః - విశ్వవ్యాప్తమగు ఇంద్రియములు కలవాడు 287
విజయాక్షః - విజయావహమైన అక్షోపలక్షితమైన రథము కలవాడు. 288
విశారదః - పండితుడు. 289
నిగ్రహః - ఇంద్రాదులను కూడ నిగ్రహించు (దండించు) వాడు. 290
సంగ్రహః - బాణాదులను లేక దాసులనుస్వీకరించువాడు. 291
కర్తా - చేయువాడు. 292

సర్వచీరనివాసనః - సర్వములే వస్త్రముయొక్క నివాసము గాగలవాడు. 293

శ్లో॥ ముఖ్యో ముఖ్యశ్చ దేహశ్చ।కాహలిః సర్వకామదః
సర్వకాలప్రసాదశ్చ । సుబలో బలరూప ధృక్ 36

ముఖ్యః - పరముడు అనగా ఉత్కృష్టుడు 294

అముఖ్యః - సర్వదేవతా మయుడు 295

దేహః - అత్యంతము పుష్టికలవాడు 296

కాహలిః - కాహళియను వాద్య విశేషముకలవాడు. 397

సర్వకామదః - సమస్తమైన కామములు నొసంగువాడు 298

సర్వకాలప్రసాద ః- సర్వకాలములందు ప్రసాదముకల వాడు. 299

సుబలః - పరపీడను తొలగించు సామర్థ్యము కలవాడు 300

బలరూపధృక్ః - బలరామరూపధారి లేక బలమురూపము ధరించువాడు. 301

శ్లో॥ సర్వకామ వరశ్చైవ । సర్వదః సర్వతోముఖః
ఆకాశనిర్విరూపశ్చ । నిపాతీహ్యావశః ఖగః 37

సర్వకామవరః — సమస్తమైనకోరికలలో శ్రేష్ఠమైన మోక్షము. 302

సర్వదః - సమస్తమునిచ్చువాడు. 303

సర్వతోముఖః - అన్నిచోట్ల వ్యాపించిన ముఖములు కలవాడు. 304

ఆకాశనిర్విరూపః - ఆకాశమునుండి వివిధ రూపములు బయలు వెడలుటకు ఆధారమైనవాడు. 305

నిపాతీ — దేహతాదాత్మ్యము పొందు స్వభావముకల
వాడు. 306

అవశః - దేహసంబంధము వలన అపరిహార్యమైన దుఃఖాది
సంబంధము కలవాడు. 307

ఖగః - హృదయాకాశమును పొందిన వాడు. 308

శ్లో॥ రౌద్రరూపోంశురాదిత్యో । బహురశ్మిః సువర్చసీ
వసువేగో మహావేగో । మనోవేగోనిశాచరః 38

రౌద్రరూపః - మిగుల భయకరమైన రూపముకలవాడు 309

అంశుః - దేవతా విశేషమైన వాడు. 310

ఆదిత్యః — అంశుసను దేవతకు సహచరుడైన భగదేవత
యగు సూర్యుడు. 311

బహురశ్మిః - అనేక కిరణములు కల సూర్యుడు. 312

సువర్చసీ - శోభన తేజము కలవాడు. 313

వసువేగః - అంతయు తనయందుంచుకొన్న వాయువు
యొక్క వేగము వంటి వేగము కలవాడు. 314

మహావేగః - వాయువేగమును మించిన మహావేగము
కలవాడు. 315

మనోవేగః - మనస్సుకంటె అధికమైన వేగముకలవాడు 316

నిశాచరః - అవిద్యతో చరించువాడు. 317

శ్లో॥ సర్వవాసీ శ్రియావాసీ । ఉపదేశకరోకరః
మునిరాత్మ నిరాలోకః।సంభగ్నశ్చ సహస్రదః 39

సర్వవాసీ — సమస్త శరీరములందు వసించువాడు. 318

శ్రియావాసీ — శ్రీతో వసించువాడు ఇచ్చట శ్రీ యనగా ఋగ్యజు స్సామములు. 319

ఉపదేశకరః - ఉపదేశము చేయువాడు 320

అకరః - మౌనముతో ఉపదేశించువాడు. 321

మునిః — మౌనము కలవాడు 322

ఆత్మనిరాలోకః- ఆత్మయందు నిశ్చయించు కొని యాలోచించువాడు. 323

సంభగ్నః - బాగుగా సేవింపబడువాడు 324

సహస్రదః - అనంతమైన ధనాదుల నొసంగువాడు. 325

శ్లో॥ పక్షీచపక్షరూపశ్చ । అతిదీప్తో విశాంపతిః
ఉన్మాదోమదనఃకామో।హ్యశ్వత్థోర్థకరోయశః 40

పక్షీ — గరుత్మంతుడను పక్షి రూపమున నున్నవాడు 326

పక్షరూపః - మిత్రరూపమున సహాయుడు 327

అతిదీప్తః - కోటి సూర్య సమానమగు మహాతేజస్సు కలవాడు లేక శత్రు తేజస్సును తిరస్కరించువాడు. 328

విశాంపతిః - సమస్త ప్రజల కధిపతి సార్వభౌముడు. 329

ఉన్మాదః - మోహము కలిగించువాడు 330

మదనః — మన్మథుడు 331

కామః-కోరబడువాడు స్త్రీమున్నగు విషయ స్వరూపుడు 332

అశ్వత్థః — సంసార వృక్షము. కావ ప్రపదాడా. (రావి) వృక్ష రూపుడు. 333

అర్థకరః - ధనాదు లొసగువాడు 334
యశః - కీర్తి ప్రదుడు. 335

శ్లో॥ వామదేవశ్చ వామశ్చ । ప్రాగ్దక్షిణశ్చ వామనః
సిద్ధయోగీ మహర్షిశ్చ । సిద్ధార్థః సిద్ధసాధకః 41

వామదేవః - వామము అనగా కర్మఫలములు విభజించి యొసగువాడు. 336
వామః - కర్మల ఫలస్వరూపుడు 337
ప్రాక్ - అన్నిటికి ఆద్యుడు. 338
దక్షిణః - ముల్లోకముల నాశ్రయింప జేయు సమర్థుడు 339
వామనః - వామనావతారుడు 340
సిద్ధయోగీ - సనత్కుమారాది సిద్ధముని 341
మహర్షిః - వసిష్ఠాది మహర్షి 342
సిద్ధార్థః - ఋషభ దత్తాత్రేయాది స్వరూపుడు. 343
సిద్ధసాధకః - విద్వాంసుడగు సన్యాసి. 344

శ్లో॥ భిక్షుశ్చ భిక్షురూపశ్చ । విపణో మృదురవ్యయః
మహాసేనో విశాఖశ్చ । షష్టిభాగో గవాంపతిః 42

భిక్షుః - లింగధారి యగు హంస 345
భిక్షురూపః - లింగరహితుడైన పరమ హంస 346
విపణః - దండాదులు లేనివాడు 347
మృదుః - సర్వభూతముల కభయదాత 348
అవ్యయః - నిర్వికారుడు మానవమానములకు హర్ష విషాదములు పొందనివాడు. 349

మహాసేనః - దేవ సేనాధి పతియగు కార్తికేయుడు 350

విశాఖః — కార్తికేయునకు సహాయుడు. 351

షష్టిభాగః — అరువదితత్త్వములుకలవాడు. 352

గవాంపతిః - ఇంద్రియముల కధిపతి. 353

శ్లో॥ **వజ్రహస్తశ్చ విష్కంభీ । చమూస్తంభనఏవచ**
**వృత్తావృత్త కరస్తాలో । మధుర్మధుకలోచనః 43**

వజ్రహస్తః - పర్వత భేదకుడగు ఇంద్రరూపుడు 354

విష్కంభీ — విస్తారము కలవాడు 355

చమూస్తంభనః — దైత్యసేనను స్తంభింప జేసిన వాడు 356

వృత్తావృత్తకరః-యుద్ధమున రథమున కూర్చుని గుండ్రముగా తిరుగుట వృత్తమనబడును పరసైన్యమును భేదించి గాయపడక తిరిగి వచ్చుట ఆవృత్తము. అవి రెండును కలవాడు. 357

తాలః - సంసార సాగరమునకుగల మూలాధారము నెరింగిన వాడు. 358

మధుః - వసంతుడు 359

మధుకలోచనః-తేనెరంగు కన్నులు కలవాడు లేక కోయిష్టికమను పక్షి కన్నుల వంటి కన్నులుకలవాడు 360

శ్లో॥ **వాచస్పత్యో వాజసనో । నిత్యమాశ్రమ పూజితః**
**బ్రహ్మచారీ లోకచారీ । సర్వచారీవిచారవిత్॥ 44**

వాచస్పత్యః - దేవపురోహితున కనుజుడు 361

వాజసనః - శాఖావిశేషమును ప్రవర్తింప జేసినవాడు. 362

నిత్యమాశ్రమపూజితః — నిత్యము నాల్గు ఆశ్రమముల
వారిచే పూజింపబడువాడు. 363

బ్రహ్మచారీ - బ్రహ్మమునందు చరించువాడు. 364

లోకచారీ - బ్రాహ్మణాది గృహములందు చరించి భుజిం
చువాడు భిక్షుకుడు. 365

సర్వచారీ — సర్వమునందు చరించువాడు. 366

విచారవిత్ — అంతర్ముఖుడై చరించువాడు. 367

**శ్లో॥ ఈశాన ఈశ్వరః కాలో । నిశాచారీ పినాకవాన్**
**నిమిత్తస్థో నిమిత్తం చ ।నందిర్నందికరో హరిః 45**

ఈశానః - నియంత 368

ఈశ్వరః - పొందు వాడు లేక వ్యాపించువాడు. 369

కాలః - అందరి పాప పుణ్యములను వాని ఫలముల
నొసంగుటకై లెక్కించు చిత్రగుప్త స్వరూపుడు 370

నిశాచారీ - మహాప్రళయ రూపమైన నిశయందు ఆనం
దముగా చరించువాడు. 37'

పినాకవాన్ — రక్షించు విల్లు కలవాడు.

నిమిత్తస్థః - నిమిత్త మనగా లక్ష్యముగాని యందున్న
వాడు. 37౬

నిమిత్తం - నిమిత్తరూపుడు. 374

నందిః - జ్ఞాన సంపద కలవాడు. 375

నందికరః - సంపత్కారుడు. 376
హరిః - హనుమద్రూపుడు. 377

శ్లో॥ నందీశ్వరశ్చ నందీచనందనో నందివర్ధనః
భగహారీని హంతాచకాలో బ్రహ్మపితామహః 46

నందీశ్వరః - నంది అనగా శివగణము లేక వాహనము దానికి ప్రభువు. 378
నందీ - శివగణ రూపుడు. 379
నందనః - ఆనంద పరచువాడు. 380
నందివర్ధనః - ఇచ్చిన సంపదను భేదించువాడు. 381
నిహంతా - మృత్యురూపమునచంపువాడు. 382
భగహారీ - ఇంద్రాదుల ఐశ్వర్యములను గూడహరించు వాడు. 383
కాలః - 64 కళలకు నివాసము. 384
బ్రహ్మ - మిగుల గొప్పవాడు. 385
పితామహః - తండ్రియగు విష్ణువునకు తండ్రి 386

శ్లో॥ చతుర్ముఖో మహాలింగః। చారులింగస్తథైవచ
లింగాధ్యక్షః సురాధ్యక్షో యోగాధ్యక్షో
యుగావహః 47

చతుర్ముఖః - విధాత 387
మహాలింగః - సర్వదేవాసురపూజ్యమైన లింగముకల వాడు. 388

చారులింగః - రమణీయమైన వేషము కలవాడు. 389
లింగాధ్యక్షః - ప్రవృత్తి నివృత్తులను నియమించువాడు 390
సురాధ్యక్షః - దేవతల కధ్యక్షుడు. 391
యోగాధ్యక్షః - యోగమనగా హృదయాకాశమున
ఇంద్రియ దేవతలనేకముచేయుట దాని కధ్యక్షుడు 392
యోగావహః - పుణ్యపాపముల తారతమ్యము కలకృత
త్రేతద్వాపర కలియుగములను నడుపువాడు. 393

శ్లో॥ బీజాధ్యక్షో బీజకర్తా । అధ్యాత్మానుగతోబలః
ఇతిహాసః సకల్పశ్చ । గౌతమోథనిశాకరః 48

బీజాధ్యక్షః - బీజమనగా ధర్మాధర్మములు. వాని కధ్య
క్షుడు అనగా ఫలదాత 394
బీజకర్తా - ధర్మాధర్మములను చేయువాడు. 395
అధ్యాత్మానుగతః - ఆత్మనుద్దేశించి ప్రవృత్తమైనశాస్త్ర
మునకు సాధకుడు. 396
బలః - ధైర్యాది బలములుకలవాడు. 397
ఇతిహాసః - భారతాది ఇతిహాస స్వరూపుడు. 398
సకల్పః - యజ్ఞప్రయోగ విధికలవాడు. 399
గౌతమః - గౌతమ స్వరూపుడు. 400
నిశాకరః - చంద్రుడు చాంద్రవ్యాకరణ కర్త. 401

శ్లో॥ దమ్భోహ్యదమ్భోవైదమ్భో।వశ్యోవశకరఃకలిః
లోకకర్తా పశుపతిః । మహాకర్తాహ్యనౌషధః 49

దమ్భః - శత్రువులను శిక్షించువాడు. 402

అదమ్భః - శిక్షించు వాడు. 403

వైదమ్భః - దంభము లేనివారి కాత్మీయుడు. 404

వశ్యః - భక్తపరాధీనుడు. 405

వశకరః - ఇతరులను వశము చేసికొనుటకు సమర్థుడు 406

కలిః — దేవాసురులకు విరోధము కలిగించువాడు. 407

లోకకర్తా - పదునాల్గు లోకములు సృజించినవాడు. 408

పశుపతిః - బ్రహ్మాది స్తంబ పర్యంతము కలజీవసముదాయమును పాలించువాడు. 409

మహాకర్తా — పంచభూతములను కూడ సృష్టించినవాడు. 410

అనౌషధః - భోక్తకాని వాడు. 411

శ్లో॥ అక్షరం పరమంబ్రహ్మ । బలవాచ్ఛక్రఏవచ
నీతిర్హ్యనీతిశ్శుద్ధాత్మా । శుద్ధోమాన్యోగతాగతః 50

అక్షరం - అవ్యయము 412

పరమంబ్రహ్మ - ఉత్కృష్టమైన యానంద స్వరూపము 413

బలవత్ - బలాభిమాని దేవతాస్వరూపము 414

శక్రః — సమర్థుడు 415

నీతిః - దండింపదగు వారి విషయమున దండము ప్రయోగించు వాడు. 416

అనీతిః - సామాద్యు పాయములు లేనివాడు. 417

శుద్ధాత్మా - విమల చిత్తుడు. 418

శుద్ధః - దోషరహితుడు. 419

మాన్యః - మాన్యార్యుడు 420
గతాగతః - సంసార రూపుడు 421

శ్లో॥ బహుప్రసాదః సుస్వప్నో।దర్పణోథ త్వమిత్రజిత్
వేదకారో మన్త్రకారో । విద్వాన్సమరమర్దనః 51

బహుప్రసాదః - మిగుల యనుగ్రహము కలవాడు. 422
సుస్వప్నః - స్వప్నావస్థాభిమాని. 423
దర్పణః - అద్దమువలె విశ్వమును ప్రతిబింబించుటకు స్థానమైన వాడు. 424
అమిత్రజిత్ - బాహ్యాభ్యంతర శత్రువులను జయించు వాడు. 42.
వేదకారః - నిశ్వాసరూపమున వేదములను వెలువరించినవాడు. 426
మంత్రకారః - వేదేతరములగు దేశభాషామయములగు తాంత్రిక పౌరాణిక మంత్రములు చేయువాడు. 427
విద్వాన్ - పండితుడు. 428
సమరమర్దనః - యుద్ధమున శత్రువులను మర్దించువాడు 429

శ్లో॥ మహామేఘనివాసీచ । మహాఘోరోవశీకరః
అగ్నిజ్వాలో మహాజ్వాలో । అతిధూమ్రో
హుతోహవిః 25

మహామేఘనివాసీ - మహామేఘమున వర్షరూపమున నివసించువాడు. 430

మహాఘోరః - ప్రళయకర్తయగుటవలన మిగుల భయంకరుడు. 431

వశీ - సర్వము తన వశమున కలవాడు. 432

కరః - ప్రళయ రూపమున జగమును హింసించువాడు. 433

అగ్నిజ్వాలః - అగ్నివంటి తేజస్సుకలవాడు. 434

మహాజ్వాలః — అగ్ని తేజమును మించిన గొప్ప తేజస్సు కలవాడు. 435

అతిధూమ్రః - కాలాగ్ని రూపమున సర్వమును దహించుకాలమున అత్యంత ధూమ్ర మయుడు. 436

హుతః -హోమముతో ప్రీతి చెందువాడు. 437

హవిః - పాలుమున్నగు హవిస్సు అయినవాడు 438

శ్లో॥ వృషణః శంకరో నిత్యం । వర్చసీధూమకేతనః
నీలస్తథాంగలుబ్ధశ్చ । శోభనోనిరవగ్రహః 53

వృషణః - కర్మఫలమును వర్షించు ధర్మరూపుడు లేక వృషము (ధర్మము) కలవాడు. 439

శంకరః - సుఖమునిచ్చువాడు. 440

నిత్యంవర్చస్వీ - నిత్యము తేజస్సుకలవాడు. 441

ధూమకేతనః - అగ్ని రూపుడు. 412

నీలః - మరకత వర్ణుడు. 443

అంగలుబ్ధః - లింగమునందు సన్నిహితుడు 444

శోభనః - కల్యాణ హేతువు. 445

నిరవగ్రహః - మనోరథములను వర్షించువాడు. 446

శ్లో॥ స్వస్తిదస్స్వస్తిభావశ్చ । భాగీభాగకరోలఘుః
ఉత్సంగశ్చ మహాంగశ్చ।మహాగర్భపరాయణః 54

స్వస్తిదః - ఉనికి నొసంగువాడు. 447
స్వస్తిభావః - మిగులగొప్పయునికి కలవాడు. 448
భాగీ - యజ్ఞమున భాగము కలవాడు. 449
భాగకరః - యజ్ఞ హవిస్సులను విభజించువాడు. 450
లఘుః - శీఘ్రము కలవాడు 451
ఉత్సంగః - సంగరహితుడు. 452
మహాంగః - మహాలింగ స్వరూపుడు. 453
మహాగర్భపరాయణః - ప్రజననాత్మకుడగు కందర్పుడు 454

శ్లో॥ కృష్ణవర్ణః సువర్ణశ్చ । ఇంద్రియం సర్వదేహినాం
మహాపాదో మహాహస్తో । మహాకాయో
మహాయశః 55

కృష్ణవర్ణః – విష్ణు స్వరూపడగుటవలన నల్లని రంగుకల
వాడు. 455
సువర్ణః - సాంబరూపమున శ్వేత వర్ణుడు. 456
సర్వదేహినామింద్రియుం - సర్వేంద్రియ రూపుడు. 457
మహాపాదః – గొప్ప పాదములు కలవాడు. 458
మహాహస్తః - గొప్పహస్తములు కలవాడు. 459
మహాకాయః - గొప్ప శరీరము కలవాడు. 460
మహాయశాః – గొప్పయశస్సు కలవాడు. 461

శ్లో॥ మహామూర్ధా మహామాత్రో । మహానేత్రో
నిశాలయః
మహాన్తకో మహాకర్ణో। మహోష్ఠశ్చ మహాహనుః 56

మహామూర్ధా — గొప్ప శిరస్సు కలవాడు. 462
మహామాత్రః - మహా ప్రమాణుడు. 463
మహానేత్రః - గొప్ప నేత్రములు కలవాడు. 464
నిశాలయః - అవిద్యను నశింప జేయువాడు. 465
మహాన్తకః - మృత్యువునకు మృత్యువు. 466
మహాకర్ణః - గొప్పకర్ణములు కలవాడు. 467
మహోష్ఠః - గొప్ప పెదవులు కలవాడు. 468
మహాహనుః - గొప్పదవడలు కలవాడు. 479

శ్లో॥ మహానాసో మహాకమ్బుః । మహాగ్రీవః
శ్మశానభాక్
మహావక్షా మహోరస్కో । హ్యన్తరాత్మా
మృగాలయః 57

మహానాసః — గొప్పనాసిక కలవాడు 470
మహాకమ్బుః - గొప్పకంఠము కలవాడు. 471
మహాగ్రీవః — విశాలకంఠము కలవాడు 472
శ్మశానభాక్ - దేహబంధములను భేదించువాడు. 473
మహావక్షాః - విశాల వక్షము కలవాడు. 474
మహోరస్కః - బలిసిన రొమ్ము కలవాడు. 475

అంతరాత్మా - లోపలియాత్మయైనవాడు. 476
మృగాలయః - ఒడియందుంచు కొన్న మృగము కలవాడు. 477

శ్లో॥ లంబనో లంబితోష్ఠశ్చ । మహామాయః పయోనిధిః
మహాదన్తో మహాదంష్ట్రో । మహాజిహ్వో
మహాముఖః 58

లంబనః - చెట్టున పండ్లు వ్రేలాడు నట్లనేక బ్రహ్మాండములు తనయందు వ్రేలాడువాడు. 478
లంబితోష్ఠః - ప్రళయ కాలమున లోకములను గ్రహించుటకు తెరవబడిన పెదవులు కలవాడు. 479
మహామాయః - బ్రహ్మాదులకు కూడజయింపరాని మాయకలవాడు. 480
పయోనిధిః - క్షీరసముద్రుడు 481
మహాదన్తః - గొప్పదంతములు కలవాడు. 482
మహాదంష్ట్రః - గొప్పకోరలు కలవాడు. 483
మహాజిహ్వః - గొప్పజిహ్వ (నాలుక) కలవాడు. 484
మహాముఖః - మిగుల పెద్దముఖము కలవాడు. 485

శ్లో॥ మహానఖో మహారోమా । మహాకోశో మహాజటః
ప్రసన్నశ్చ ప్రసాదశ్చ।ప్రత్యయోగిరి సాధనః58

మహానఖః - గొప్ప నఖములు కలనరసింహుడు 486
మహారోమాః - గొప్పరోమములు కలవరాహామూర్తి 487

మహాకోశః - మహోదరుడు. 488

మహాజటః - గొప్పజడలు కలవాడు 489

ప్రసన్నః - ఆనందమగ్నుడు 490

ప్రసాదః - ప్రసన్నాత్ముడు 491

ప్రత్యయః - అనుభవజ్ఞానరూపుడు. 492

గిరిసాధనః - యుద్ధమున పర్వతమే సాధనముగా కల
వాడు గిరిధన్వుడని భావము 493

శ్లో॥ స్నేహనోస్నేహనశ్చైవ । అజితశ్చమహామునిః
వృక్షాకారో వృక్షకేతు । రనలో వాయువాహనః ॥59

స్నేహనః - ప్రజలయందు పితృవాత్సల్యము కలవాడు. 494

అస్నేహనః - వాత్సల్యములేని వాడు. 495

అజితః - పరాజయము ఎవరి వలనను పొందనివాడు. 496

మహామునిః - మిగుల మౌనమునవలంబించువాడు లేక
మనన శీలుడు. 497

వృక్షాకారః - సంసార వృక్షాకారుడు. 498

వృక్షకేతుః - సంసార వృక్షము కేతువుగా కలవాడు 499

అనలః - అలం (చాలు) అను తృప్తిలేనివాడు అగ్ని
స్వరూపుడు. 500

వాయువాహనః - వాయువే వాహనముగా కలవాడు 501

శ్లో॥ గండలీ మేరుధామాచ । దేవాధిపతిరేవచ
అధర్వ శీర్షః సామాస్య । ఋక్సహస్రా
మితేక్షణః 60

గండలీః - పర్వత గుహలయందుండు వాడు. 502
మేరుధామా — మేరుపర్వతము నివాసముగా కలవాడు 503
దేవాధిపతిః - దేవతల కధిపతి 504
అధర్వశీర్షః — అధర్వవేదము శిరముగా కలవాడు. 505
సామాస్యః - సామవేదము ముఖముగా కలవాడు. 506
ఋక్సహస్రామితేక్షణః - ఋగ్వేదమంత్ర సహస్రములు అమిత నేత్రములుగా కలవాడు. 507

శ్లో॥ యజుః పాదభుజోగుహ్యః। ప్రకాశోజంగమస్తథా
అమోఘార్థః ప్రసాదశ్చ।అభిగమ్యః సుదర్శనః

యజుః పాదభుజః - యజుర్వేదము పాదములుగ భుజములుగ కలవాడు. 508
గుహ్యః - ఉపనిషత్ప్రదేశమైనవాడు. 509
ప్రకాశః - కర్మకాండమైనవాడు. 510
జంగమః - మనుష్యుడు కుక్కమున్నగు జంతు స్వరూపుడు. 511
అమోఘార్థః — అమోఘమైన అభ్యర్థనము కలవాడు. 512
అభిగమ్యః - సులభ ప్రాప్యుడు. 513
సుదర్శనః - మంగళప్రదమైన దర్శనము కలవాడు. 514
ప్రసాదః - దయాళువు. 515

శ్లో॥ ఉపకారః ప్రియస్సర్వః । కనకః కాంచనచ్ఛవిః
నాభిర్నందికరోభావః । పుష్కరస్థాపితః స్థిరః 62

ఉపకారః - సంతోషపరచువాడు. 516
ప్రియః - సుఖప్రదాత 517
సర్వః - అభిముఖముగా వచ్చువాడు. 518
కనకః - స్వర్ణాది ప్రియవస్తురూపుడు. 519
కాంచనచ్ఛవిః - బంగారుకాంతి కలవాడు. 520
నాభిః - భువనమునకు మధ్యభాగము. 521
నన్దికరః - యజ్ఞఫల సమృద్ధికరుడు. 522
భావః - క్రతుశ్రద్ధా రూపుడు. 523
పుష్కరస్థాపితః - బ్రహ్మాండప్రభువు 524
స్థిరః - పర్వతాది స్థావరరూపుడు. 525

శ్లో॥ ద్వాదశస్త్రాసన శ్చాద్యో। యజ్ఞో యజ్ఞసమాహితః
నక్తం కలిశ్చ కాలశ్చ । మకరః కాలపూజితః 63

ద్వాదశః - మనుష్యులకు గర్భవాసాది దశలు పది
మృత్యువు పదకొండు మోక్షము పన్నెండు. 526
త్రాసనః - భయజనకుడు. 527
ఆద్యః - సంసారము కంటె మొదటివాడు. ఆదిమధ్యాన్త
రూపుడగు శుద్ధుడు. 528
యజ్ఞసమాహితః - యజ్ఞమునలననే లభ్యుడు. 529
యజ్ఞః - జీవేశ్వరులకు సంగతి రూపమైన యోగము. 530
నక్తం - అప్రకాశాత్మడు మహామోహము. 531
కలిః - కామక్రోధలోభాది రూపుడు 532
కాలః - జననమరణ ప్రవాహమును నడిపించువాడు. 533

మకరః - మకరాకారము కల శింశుమారచక్రము యొక్క స్వరూపము కలవాడు. 534

కాలపూజితః - కాలునిచే పూజింపబడువాడు. 535

శ్లో॥ సగణోగణకారశ్చ। భూతవాహన సారథి
భస్మశయోభస్మగోప్తా। భస్మభూతస్తరుర్గణః 64

సగణః - ప్రమథాదులతో కూడిన వాడు. 536

గణకారః - బాణాది భక్తులను గణములుగా చేసికొను వాడు. 537

భూతవాహనసారథిః - ప్రాణుల యోగక్షేమములు నిర్వహించు బ్రహ్మ సారథిగా కలవాడు. 538

భస్మశయః - పాపముల బంధములు నశింపజేసి మోక్షమిచ్చు భస్మమున శయనించువాడు. 539

భస్మగోప్తా - భస్మముతో లోకమును రక్షించువాడు. 540

భస్మభూతః - భస్మమయుడు. 541

తరుః - కల్పవృక్షరూపుడు. 542

గణః - భృంగి నందికేశ్వరాది గణరూపుడు. 543

శ్లో॥ లోకపాల స్తథాలోకో।మహాత్మా సర్వపూజితః
శుక్ల స్త్రీ శుక్ల స్సంపన్నః।శుచిర్భూతనిషేవితః 65

లోకపాలః - పదునాల్గు భువనములను పాలించువాడు. 544

అలోకః - లోకాతీతుడు 545

మహాత్మా - పూర్ణుడు. 546

సర్వపూజితః — అందరిచేత పూజింపబడువాడు. 547
శుక్లః — శుద్ధుడు. 548
త్రిశుక్లః - మనోవాక్కాయములు (త్రికరణములు)
శుద్ధికలవాడు. 549
సంపన్నః - కైవల్యసంపదకలవాడు. 550
శుచిః - సంగములేనివాడు మలస్పర్శలేనివాడు. 551
భూతనిషేవితః - పూర్వాచార్యులచేత సేవింపబడువాడు 552

శ్లో॥ ఆశ్రమస్థః క్రియావస్థో । విశ్వకర్మమతిర్వరః
విశాల శాఖస్తామ్రోష్ఠో । హ్యంబుజాలస్సునిశ్చలః

ఆశ్రమస్థః - నాల్గు ఆశ్రమములందును ధర్మరూపమున
నుండువాడు. 553
క్రియావస్థః - పూర్వరూపమైన ధర్మమునందును ఉత్తర
రూపమైన యోగములందును లగ్నమైయుండువాడు 554
విశ్వకర్మమతిః - విశ్వకర్మయందలి నేర్పరితనము
యొక్క రూపము కలవాడు. 555
వరః - లక్ష్మ్యాది రూపముకలవాడు. 556
విశాలశాఖః - విశాలమైన బాహువులు కలవాడు. 557
తామ్రోష్ఠః - ఎఱ్ఱని పెదవులు కలవాడు. 558
అంబుజాలః - జల సమూహముకల సాగరుడు. 559
సునిశ్చలః - పర్వతాది రూపుడు. 560

శ్లో॥ కపిలః కపిశశ్శుక్ల । ఆయుశ్చైవపరోవరః
గన్ధర్వోహ్యదితిస్తార్క్ష్యః । సువిజ్ఞేయస్సుశారదః 67

కపిలః - కపిల వర్ణుడు. 561

కపిశః - కపిశవర్ణుడు. 562

శుక్లః - శుక్లవర్ణుడు. 563

ఆయుః - జీవనకాలము 564

పరః - ప్రాచీనుడు. 565

అపరః — అర్వాచీనుడు 566

గన్ధర్వః — చిత్రరథాది గంధర్వరూపుడు. 567

అదితిః - దేవమాతయగు అదితిలేక భూమి. 568

తార్క్ష్యః — వైనతేయుడు. 569

సువిజ్ఞేయః — సులభముగా తెలియదగువాడు. 570

సుశారదః — శుభవాక్కు కలవాడు. 571

శ్లో॥ పరశ్వధాయుధో దేవ । అనుకారీ సుబాన్ధవః
తుమ్బవీణో మహాక్రోధః।ఊర్ధ్వరేతా జలేశయః॥68

పరశ్వధాయుధః -గొడ్డలి ఆయుధముగా కలపరశురాముని రూపుడు. 572

దేవః - జయశీలుడు 573

అనుకారీ — భక్తులననుకరించువాడు. 574

సుబాంధవః — అర్జున సఖుడు. 575

తుంబవీణః - తుంబీఫల ద్వయముతో కూడిన రుద్రవీణ కలవాడు. 576

మహాక్రోధః - ప్రళయకాలమున మహాక్రోధము కలవాడు. 577

ఊర్ధ్వరేతాః — దేవమనుష్యులకు పైన బ్రహ్మవిష్ణ్వాది రూపమైన ప్రజలు కలవాడు. 578

జలేశయః - శేషపర్యంకమున జలమున శయనించు విష్ణువు. 579

శ్లో॥ ఉగ్రోవంశకరోవంశో । వంశనాదోహ్యనిందితః
సర్వాంగ రూపోమాయావీ । సుహృదోహ్యని
లోనలః 69

ఉగ్రః - అధికముగా గ్రసించువాడు. 580

వంశకరః - వంశప్రవర్తకుడు. 581

వంశః - వంశస్వరూపుడు. 582

వంశనాదః - వేణునాదముచేయు కృష్ణరూపుడు 583

అనిందితః — నిందారహితుడు. 584

సర్వాంగరూపః - సర్వాంగసుందరుడు. 585

మాయావీ - మాయచేతవిశిష్టుడు. 586

సుహృదః - ప్రత్యుపకారము కోరకయే యుపకారము చేయువాడు. 587

అనిలః - వాయువు. 588

అనలః — అగ్ని 589

శ్లో॥ బన్ధనో బన్ధకర్తాచ । సుబన్ధన విమోచనః
సయజ్ఞారిఃసకామారిః।మహాదంష్ట్రోమహాయుధః 70

బన్ధనః - సంసారపాశరూపుడు. 590

బంధకర్త - సంసారనిర్మాత 591

సుబంధన విమోచనః - మాయాపాశమునుండి విముక్తి
కలిగించువాడు. 592

యజ్ఞారిః - యజ్ఞ శత్రువులగు దైత్యులతో కలసియుండు
వాడు. 593

కామారిః - జితకాములగు యోగులతో కలసియుండు
వారు. 594

మహాదంష్ట్రః - పెద్దకోరలు కల్గిన నృసింహరూపుడు. 595

మహాయుధః - గొప్పఆయుధములు కలవాడు. 596

శ్లో॥ బహుధా నిన్దితశ్శర్వః । శంకరశ్శంకరోధనః
అమరేశోమహాదేవో । విశ్వదేవః సురారిహా 71

బహుధానిన్దితః - ఋషులచేత (దారుకవనమున) పెక్కు-
రీతులుగా నిందింపబడినవాడు. 597

శర్వః - దారుకవనమునులను జేయువాడు. 598

శంకరః - అందరిక్షేమము కరమునకలవాడు. 599

శంకరః - సర్వసంశయనాశకుడు. 600

అధనః - దిగంబరుడగుట వలనధనహీనుడు. 601

అమరేశః — అమరులకు ప్రభువు 602

మహాదేవః - దేవేంద్రాదులకు కూడా పూజ్యుడు 603

విశ్వదేవః - విశ్వమనగా విష్ణువు విష్ణువునకు కూడా
ఆరాధ్యుడు. 604

సురారిహా — దేవతల శత్రువులను సంహరించువాడు. 605

శ్లో॥ అహిర్బుధ్న్యో నిలాభశ్చ । చేకితానో హవి స్తథా
అజైకపాచ్చ కాపాలీ । త్రిశంకురజితశ్శివః 72

అహిర్బుధ్న్యః – శేషస్వరూపుడు. 606

అనిలాభః - వాయువు అగోచరుడైనను స్పర్శవలన
తెలియ బడునట్లే విషయసంస్పర్శజన్యానుభవుడు. 607

చేకితానః - అధికముగా తెలిసినవాడు. 608

హవిః - భోగ్యవస్తుసము దాయము 609

అజైకపాత్ - ఏకాదశరుద్రులలో నొకడు. 610

కాపాలీ-భూమ్యాకాశములనెడి కపాలములు కలవాడు 611

త్రిశంకుః - సర్వజీవరూపుడు. 612

అజితః - త్రిగుణాతీతుడు 613

శివః - శుద్ధుడు. 614

శ్లో॥ ధన్వన్తరి ర్ధూమకేతుః । స్కన్దో వైశ్రవ స్తథా
ధాతా శక్రశ్చ విష్ణుశ్చ । మిత్ర స్త్వష్టా
ధ్రువోధరః 73

ధన్వన్తరిః - మహావైద్యుడు 615

ధూమకేతుః - ఉత్పాతవిశేషమైనవాడు. 616

స్కన్దః — కుమారస్వామి రూపుడు. 617

వైశ్రవణః - కుబేర రూపుడు. 618

ధాతా - బ్రహ్మ 619

శక్రః - ఇంద్రుడు 620

విష్ణుః - విష్ణువు. 621
మిత్రః - మృత్యువునుండి రక్షించువాడు. 622
త్వష్టా — త్వష్ట 623
ధ్రువః - ధ్రువుడు. 624
ధరః - ధరించువాడు. 625

శ్లో॥ ప్రభావ స్సర్వగోవాయు। రర్యమాసవితారవిః
ఉషం గుశ్చ విధాతాచ । మాంధాతా భూత
భావనః 74

ప్రభాసః - ప్రభావుడను వసువు. 626
సర్వగోవాయుః - సర్వవ్యాపకుడగు వాయురూపుడు. 627
అర్యమా — ద్వాదశాదిత్యులలో నొకడు 628
సవితాః - సమస్త జగత్తును సృష్టించువాడు. 629
రవిః - సూర్యుడు 630
ఉషంగుః - కాల్చునట్టి కిరణములు కలగవాడు. 631
మాంధాతా - జీవునకు తుష్టికలిగించువాడు. 632
విధాతా — వివిధ ప్రకారములుగ పోషించువాడు 633
భూతభావనః — రజ్జుస్సర్పభ్రాంతివలె భూతములకు భ్రమ
గొల్పువాడు. 634

శ్లో॥ విభు ర్వర్ణ విభావీచ । సర్వకామగుణావహః
పద్మనాభో మహాగర్భః।చంద్రవక్త్రో నలోనలః75

విభుః - వివిధ రూపములలో నుండువాడు. 635

వర్ణవిభావీ - తెలుపు పసుపు పచ్చ మున్నగు రంగులను పలుకీతులలో కలిగియుండువాడు. 636

సర్వకామగుణావహః - ధ్యానించువారికి సమస్తమగు కోరికలు గుణములు ఇచ్చువాడు. 637

పద్మనాభః - నాభియందలి మణిపూరచక్రమున విశ్వము యొక్క స్థానముకలవాడు. 638

మహాగర్భః - గొప్పవారగు బ్రహ్మాదులు ఉదరమున కలవాడు. 639

చంద్రవక్త్రః - రమ్యమైన రూపము కలవాడు. 640

అనిలః - అనిలాధిష్ఠానదైవము యొక్క రూపము కలవాడు. 641

అనలః - అనలాధిష్ఠానరూపుడు. 642

శ్లో॥ బలవాం శ్చోపశాంతశ్చ । పురాణః పుణ్యచంచురీ
కురుకర్తా కురువాసీ । కురుభూతో గుణౌషధః 76

బలవాన్ - బలము కలవాడు. 643

ఉపశాంతః - శాంతస్వరూపుడు. 644

పురాణః - పురాణపురుషుడు. 645

పుణ్యచంచుః - పుణ్యముచేత తెలియబడువాడు. 646

ఈ - లక్ష్మీ స్వరూపుడు లేక దయాస్వరూపుడు. 647

కురువాసీ - కురుక్షేత్రద్వయనివాసి 648

కురుభూతః - కురుక్షేత్ర ద్వయ స్వరూపుడు. 649

గుణౌషధః - ఐశ్వర్య జ్ఞానవైరాగ్య ధర్మాదులకు ఔషధమువలె ఉద్దీపకుడు. 650

శ్లో॥ సర్వాశయోదర్భచారీ సర్వేషాంప్రాణినాంపతిః
దేవదేవః సుఖాసక్తః సదసత్సర్వరత్నవిత్. 77

సర్వాశయః - అందరికి నిద్రా స్థానములు 651

దర్భచారీ — దర్భలయందుంచబడిన హవిస్సులను భుజించువాడు. 652

సర్వేషాంప్రాణినాంపతిః - సమస్తప్రాణులకధిపతి. 653

దేవదేవః — దేవతలకు దేవత 654

సుఖాసక్తః — సుఖమునందాసక్తికలవాడు. 655

సత్ - కార్యము. 656

అసత్ — కారణము 657

సర్వరత్నవిత్ - ఆయాజాతులయందు శ్రేష్ఠ వస్తువులు ఎరిగినవాడు. 658

శ్లో॥ కైలాసగిరివాసీచ హిమవద్గిరిసంశ్రియః
కూలహారీ కూలకర్తా బహువిద్యో బహుప్రదః॥ 78

కైలాసగిరివాసీ - కైలాసగిరియందు వసించువాడు. 659

హిమవద్గిరిసంశ్రయః - మంచుకొండనాశ్రయించినవాడు 660

కూలహారీ — మహాప్రవాహ రూపమున తీరమునందలి ద్రుమములను హరించువాడు. 661

కూలకర్తా - మహాతటాక కర్త 662

బహువిద్యః - బహువిద్యలు కలవాడు. 663

బహుప్రదః - అధికముగా నిచ్చువాడు. 664

శ్లో॥ వణిజో వర్ధకీ వృక్షో । వకుళశ్చన్దనచ్ఛదః
సారగ్రీవో మహాజత్రు । రలోలశ్చ మహౌషధః

వణిజః - వైశ్యుడు 665
వర్ధకీ - సంసారవృక్షమును ఛేదించువాడు. 666
వృక్షః - సంసార వృక్ష స్వరూపుడు. 667
వకుళః - పొగడచెట్టు 668
చన్దనః — చందన వృక్షము 669
ఛదః - ఏడాకుల అరటి 670
సారగ్రీవః - దృఢకంఠుడు. 671
మహాజత్రుః - కంఠస్కంధముల క్రిందగల యెముక
కలవాడు. 672
అలోలః - అచంచలుడు. 673
మహౌషధః - వ్రీహియవాది సస్యరూపుడు. 674

శ్లో॥ సిద్ధార్థకారీ సిద్ధార్థ । శ్ఛందోవ్యాకరణోత్తరః
సింహనాదః సింహదంష్ట్రః।సింహగస్సింహవాహనః

సిద్ధార్థకారీ-ఆశ్రితులను సఫలమనోరథులుగా చేయువాడు. 675
సిద్ధార్థః - పూర్వపక్షము ఖండించి చేయుసిద్ధాంతి
(దానివిశేషణముచంధో వ్యాకరణోత్తము) 676
సింహనాదః - సింహమువలె గర్జన చేయువాడు. 677
సింహదంష్ట్రః - సింహపు కోరలు కలవాడు. 678
సింహగః - సింహరూపుడు. 679
సింహవాహనః - సింహము పూన్చినరథమెక్కినవాడు. 680

శ్లో॥ ప్రభావాత్మ జగత్కాల । స్థాలోలోకహిత స్తరుః
సారంగోనవ చక్రాంగః । కేతుమాలీసభావనః.61

ప్రభావాత్మా - సత్యమునకు సత్యము. 682

జగత్కాల స్థాలః - జగత్తును గ్రసించు కాలము భోజన పాత్రగా కలవాడు. 683

లోకహితః - లోకహితుడు. 684

తరుః — తరింపజేయువాడు. 685

సారంగః - పక్షివిశేష రూపుడు. 686

నవచక్రాంగః - నూతన హంసయైనవాడు. 687

కేతుమాలీ — మయూర కుక్కుటాది పక్షిరూపుడు. 688

సభావనః - ధర్మపరీక్ష స్థానమును రక్షించువాడు. 689

శ్లో॥ భూతాలయో భూతపతిరహోరాత్రమనిందితః 82

భూతాలయః — ప్రాణులకాలయుడు. 690

భూతపతిః — ప్రాణులకధిపతి. 691

అహోరాత్రం — పగలురాత్రి అనువాని రూపము అయినవాడు. 692

అనిందితః - నిందిపబడనివాడు. 693

శ్లో॥ వాహితా సర్వభూతానాం । నిలయశ్చ విభుర్భవః
అమోఘస్సంయతోహ్యశ్వో । భోజనః
ప్రాణధారణః. 83

సర్వభూతానాం వాహితా - సర్వభూతములను : హించు వాడు. 694
సర్వభూతనిలయః - సర్వభూతముల నివాసస్థానము 695
విభుః - జన్మరహితుడు. 696
భవః - ఉండువాడు. 697
అమోఘః - నైష్ఫల్యము లేనివాడు. 698
సంయతః - ధారణ ధ్యాన సమాధులు కలవాడు. 699
అశ్వః - ఉచ్చైశ్శ్రవాది రూపుడు. 700
భోజనః - అన్నదాత 701
ప్రాణధారణః - ప్రాణములు నిలుపువాడు. 702

శ్లో॥ ధృతిమాన్ మతిమాన్ దక్షః । సత్కృతశ్చ యుగాధిపః
గోపాలి ర్గోపతి ర్గ్రామో।గోచర్మవసనోహరిః 84

ధృతిమాన్ - ధైర్యము కలవాడు. 703
మతిమాన్ - మతికలవాడు. 704
దక్షః - ఉత్సాహము కలవాడు. 705
సత్కృతః - ఆదరింపబడినవాడు. 706
యుగాధిపః - ధర్మాధర్మ ఫలదాత. 707
గోపాలిః - ఇంద్రియ పాలకుడు. 708
గోపతిః - రశ్ములకు పతి సూర్యుడు మున్నగువాడు. 709
గ్రామః - సమూహము. 710

గోచర్మవసనః - గోచర్మమయమైన వస్త్రము దాల్చు
వాడు. 711

హారిః - భక్తుల దుఃఖమును హరించువాడు. 712

శ్లో॥ హిరణ్యబాహుశ్చతథా । గుహాపాలః ప్రవేశినాం
ప్రకృష్టారిర్మహాహర్షో ।జితకామో జితేన్ద్రియః 85

హిరణ్యబాహుః - రమణీయమైన బాహులు కలవాడు. 713

గుహాపాలః ప్రవేశినాం - అంతః ప్రవేశ శీలురగు
యోగులు చిరకాలము కాష్ఠములవలె నున్నప్పుడు
వారి శరీరములు కాపాడువాడు. 714

ప్రకృష్టారిః - మిగుల నాశనము చేయబడిన కామాది
శత్రువులు కలవాడు. 715

మహాహర్షః - గొప్పహర్షము కలవాడు. 716

జితకామః - జయింపబడిన కామము కలవాడు. 717

జితేంద్రియః - జయింపబడిన ఇంద్రియములు కలవాడు 718

శ్లో॥ గాంధారశ్చ సువాసశ్చ । తపస్సక్తోరతిర్నరః
మహాగీతో మహానృత్యో । హ్యప్సరోగణ
సేవితః 86

గాంధారః - స్వరవిశేషమైనవాడు. 719

సువాసః - కైలాసమను శోభనమైన నివాసము కల
వాడు. 720

తపస్సక్తః - తపము నందాసక్తి కలవాడు. 721

రతిః - ప్రీతిరూపుడు. 722

నరః - బ్రహ్మాండమును పొందించు విరాడ్రూపుడు. 723

మహాగీతః - వేదశాస్త్రములచేత గానము చేయబడు
మహిమ కలవాడు. 724

మహానృత్యః - గొప్పనృత్యము కలవాడు. 725

అప్సరోగణసేవితః - అప్సరసల సముదాయము చేత
సేవింపబడువాడు. 726

శ్లో॥ మహాకేతు ర్మహాధాతుః । నైకసాను చరశ్చలః
ఆవేదనీయ ఆదేశః । సర్వగన్ధసుఖావహః 87

మహాకేతుః - వృషరూపమైన పతాకముకలవాడు. 727

మహాధాతుః - మేరుపర్వతము. 728

నైకసానుచరః - అనేక శిఖరములందు సంచరించువాడు 729

చలః - పట్టుటకు సాధ్యముకానివాడు. 730

ఆవేదనీయః — వాక్కులకు గోచరముకాని వాడైనను
గురువులు ఉపదేశించుటకు సాధ్యమైన వాడు. 731

ఆదేశః - కేవలము ఉపదేశ రూపుడు. 732

సర్వగన్ధ సుఖావహః — ఒకేసారి సమస్త గంధములకు
అనగా విషయస్పర్శలకు సుఖము కలిగించువాడు. 733

శ్లో॥ తోరణస్తారణోవాతః । పరిధీపతి ఖేచరః
సంయోగో వర్ధనోవృద్ధో । అతివృద్ధోగుణాధికః 88

తోరణః - మోక్ష ద్వారాదుల స్వరూపుడు. 734

తారణః - తరింప జేయువాడు. 735

వాతః - వాయురూపుడు. 736

పరిధీ — బ్రహ్మాండము యొక్క దుర్గరూపుడు. 737

పతిఖేచరః - ఖేచరేశ్వరుడు గరుడుడు. 738

సంయోగో వర్ధనః - వృద్ధిహేతువగు స్త్రీ పురుష సంబంధము. 739

వృద్ధో గుణాధికః - జ్ఞానైశ్వర్యాదికముల వలన వృద్ధుడు 740

అతివృద్ధః - మిగుల వృద్ధుడు. 741

గుణాధికః - గుణాదికములచేత అధికుడు. 742

శ్లో॥ నిత్య ఆత్మసహాయశ్చ । దేవాసురపతిః పతిః
యుక్తశ్చ యుక్తబాహుశ్చ । దేవోదివిసుపర్వణః

నిత్య ఆత్మ సహాయః — నిత్యుడు ఆత్మసహాయుడు. 743

దేవాసురపతిః - దేవదానవులకధిపతి. 744

పతిః - సమస్తమున కధిపతి 745

యుక్తః - యుద్ధాదులందు సన్నద్ధుడు 746

యుక్తబాహుః - శత్రుమర్దన యోగ్యమైన బాహులు కలవాడు. 747

దేవోదివిసుపర్వణః - స్వర్గమున ఇంద్రుడును మహాపురుషున కారాధ్యుడు. 748

శ్లో॥ ఆషాఢశ్చసుషాఢశ్చ । ధ్రువోథ హరిణోహరః
వపురావర్తమానేభ్యో । వసుశ్రేష్ఠోమహాపథః 90

ఆషాఢః - సర్వసహన సామర్థ్యప్రదుడు. 749

సుషాఢః - ఉత్తమ సహనశీలుడు. 750

ధ్రువః - అచంచలుడు 751

హారిణః — శుద్ధుడు. 752

హరః - శూలధారి 753

సపురావర్తమానేభ్యః - స్వర్గచ్యుతులకు దేహమొసంగు
వాడు. 754

వసుశ్రేష్ఠః - ధనముకంటె అధికుడు. 755

మహాపథః - శిష్టాచారరూపుడు. 756

శ్లో॥ శిరోహారీ విమర్శశ్చ । సర్వలక్షణలక్షితః
అక్షశ్చరథయోగీచ । సర్వయోగీమహాబలః 91

శిరోహారీ విమర్శః - వివేకముతో బ్రహ్మశిరస్సును
ఛేదించినవాడు. 757

సర్వలక్షణలక్షితః - సాముద్రిక శాస్త్రమున చెప్పిన
శుభలక్షములు కలవాడు. 758

అక్షశ్చరథయోగీ - రథసంధాన దారువు కావున రథ
ముతో కూర్పబడినవాడు. 759

సర్వయోగీ - ప్రభువగుట వలన ఎల్లరను స్పృశించు
వాడు. 760

మహాబలః - మహావీరుడు. 761

శ్లో॥ సమామ్నాయో సమామ్నాయ । స్తీర్థదేవో
మహారథః
నిర్జీవోజీవనో మంత్రః।శుభాక్షోబహుకర్కశః 92

సమామ్నాయః - వేదరూపుడు. 762
అసమామ్నాయః - స్మృతీతిహాసపురాణాగమాది
రూపుడు. 763
తీర్థదేవః - తీర్థస్వరూపుడు. 764
మహారథః - భూమిరథముగా కలవాడు. 765
నిర్జీవః - అచేతన ప్రపంచరూపుడు. 766
జీవనః - అచేతనమైన దేహమున చైతన్యదాత 767
మంత్రః – ప్రణవాది లేక మృతసంజీవ మంత్రము. 768
శుభాక్షః - శాంత దృష్టికలవాడు. 769
బహుకర్కశః - సంహారకుడగుట వలన మిగుల కఠినుడు 770

శ్లో॥ రత్నప్రభూతోరత్నాంగో । మహార్ణవని పానవిత్
మూలం విశాలోహ్యామృతో । వ్యక్తావ్యక్తస్త
పోనిధిః 93

రత్నప్రభూతః - అధికమగురత్నములు (శ్రేష్ఠవస్తువులు)
కలవాడు. 771
రత్నాంగః – రత్నమయమైన అంగములు కలవాడు 772
మహార్ణవనిపానవిత్ - సముద్రములనెడినిపానముల
నెండించువాడు నిపానములనగా పశువులు నీరుత్రాగు
టకు కట్టిన కుండములు. 773

మూలం — సంసారవృక్షమున కధిష్ఠానము. 774
విశాలః - మిగుల విలసిల్లువాడు. 775
అమృతః - సుధారూపుడు. 776
వ్యక్తావ్యక్తః - కార్యకారణ రూపుడు. 777
తపోనిధిః - మహాముని. 778

శ్లో॥ ఆరోహణోధిరోహశ్చ । శీలధారీమహాయశాః
సేనాకల్పో మహాకల్పో।యోగోయుగకరోహరిః 94

ఆరోహణః - పరమ పదమారోహింప గోరువాడు. 779
అధిరూఢః — పరమపదారూఢుడు. 780
శీలధారి - సదాచారుడు. 781
మహాయశాః - పుణ్యకారి 782
సేనాకల్పః — సైన్యాలంకారపరాక్రమ రూపుడు. 783
మహాకల్పః - దివ్యభూషణుడు. 784
యోగః - చిత్తవృత్తినిరోధకుడు. 785
యుగకరః — యుగములు చేతకలవాడు. 786
హరిః — త్రివిక్రముడు. 787

శ్లో॥ యుగరూపో మహారూపో । మహానాగహనోవధః
న్యాయనిర్వపణఃపాదః । పండితోహ్యచలోపమః

యుగరూపః - ధర్మాధర్మసంకర రూపుడు. 788
మహారూపః - రూపరహితుడగు గొప్పవాడు. 789
మహానాగహనః - గజాసురహంత 790

వధః - మృత్యువు. 791
న్యాయనిర్వపణః - ధర్మానుసారముగ మనోరథములు
దీర్చువాడు. 792
పాదః - పొందదగు గమ్యుడు. 793
పండితః - పరోక్షజ్ఞానము కలవాడు. 794
అచలోపమః - తత్త్వజ్ఞాని. 795

శ్లో॥ బహుమాలో మహామాలః శశీహరసులోచనః
విస్తారో లవణః కూపః । త్రియుగస్సఫలోదయః

బహుమాలః - అనంతలీలలు కలవాడు. 796
మహామాలః - వాడని పూలమాలకలవాడు. 797
శశీహరసులోచనః - చంద్రుడేశాంతదృష్టిరూపుడు. 798
విస్తారోలవణః కూపః - లవణ సముద్రరూపి. 799
త్రియుగః - కృతత్రేతద్వాపర యుగములైనవాడు. 800
సఫలోదయః - సఫలమైన అవతారము కలవాడు. 801

శ్లో॥ త్రిలోచనో విషణ్ణాంగో । మణివిద్ధో జటాధరః
బిన్దుర్విసర్గ స్సుముఖః । శరః సర్వాయుధఃసహః

త్రిలోచనః - శాస్త్రము ఆచార్యుడు ధ్యానము అను
మూడు కన్నులు కలవాడు. 802
విషణ్ణాంగః — భూమ్యాద్యష్ట మూర్తులు కలవాడు. 803
మణివిద్ధః - కుండలధారి 804
జటాధరః - జడదారి 805

బిందుః - అనుస్వారము 806

విసర్గః - విసర్జనీయుడు. 807

సుముఖః - వ్యక్తమైన వర్ణములు కలవాడు. 808

శరః - బాణము. 809

సర్వాయుధః - సర్వాయుధ స్వరూపుడు. 810

సహః - సర్వమును సహించువాడు. 811

శ్లో॥ నివేదనః సుఖజాతః । సుగన్ధారో మహాధనుః
గన్ధపాలీచ భగవా । నుత్థానస్సర్వకర్మణాం 98

నివేదనః - సమస్త వ్యాపారములు విరమించినందు వలన కలిగిన జ్ఞానము కలవాడు. 812

సుఖజాతః - సుఖరూపమున ఆవిర్భవించినవాడు. 813

సుగాన్ధారః - చక్కని గాంధర దేశమున అవతరించిన వాడు. 814

మహాధనుః - పినాకధన్వుడు. 815

గంధపాలీచభగవాన్ - సర్వప్రాణుల బుద్ధి వాసనా మయుడగుభగవానుడు. 816

ఉత్థానః సర్వకర్మాణాం - సర్వకర్మలు పరమేశ్వరు నుండినెలువడి నవి. 817

శ్లో॥ మంథానో బహులోవాయుః । సకలః సర్వలోచనః
తలస్తాలః కరస్థాలీ । ఊర్ధ్వసంహననో మహాన్

మంథానో బహులోవాయుః - గొప్ప ప్రళయవాయువు 818

సకలః - పూర్ణుడు. 819

సర్వలోచనః - అంతయు చూచువాడు. 820

తలస్తాలః — తాళమనెడివాద్యము. 821

కరస్థాలీ — చేతులే భోజన పాత్రగలవాడు. 822

ఊర్ధ్వసంహననః - శ్రేష్ఠమైనదృఢశరీరముకలవాడు. 823

మహాన్ — అత్యున్నతుడు. 824

శ్లో॥ ఛత్రం సుచ్ఛత్రో విఖ్యాతో।లోకః సర్వాశ్రయః క్రమః

ముండో విరూపో వికృతో । దండీ కుండీ వికుర్వణః 10

ఛత్రం - ఛత్రముతో సమానముగా పాపతాపమునుండి కాపాడువాడు. 825

సుచ్ఛత్రః - ఉత్తమ ఛత్రస్వరూపుడు. 826

విఖ్యాతోలోకః - ప్రసిద్ధమైన ప్రాణిస్వరూపుడు. 827

సర్వాశ్రయః క్రమః - సర్వాశ్రయ భూతమైన పాదము కలవాడు. 828

ముణ్డః — ముండనము చేయబడినవాడు. 829

విరూపః - వికట రూపుడు. 830

వికృతః - విపరీత క్రియలన్నియు దాల్చువాడు. 831

దండీ — దండధారి. 832

కుండీ - కమండలువు దాల్చువాడు. 833

వికుర్వణః — కర్మల వలన లభ్యముకానివాడు. 834

శ్లో॥ హర్యక్షః కకుభోవజ్రీ । శతజిహ్వః సహస్రపాత్
సహస్రమూర్ధా దేవేన్ద్రః । సర్వదేవమయోగురుః

హర్యక్షః - సింహరూపుడు. 835

కకుభః — సర్వదిగ్రూపుడు. 836

వజ్రీ - వజ్రధారి 837

శతజిహ్వః - అనేక జిహ్వలు కలవాడు. 838

సహస్రపాత్ సహస్రమూర్ధా — అనేక పాదములు శిర
వులు కలవాడు. 839

దేవేన్ద్రః - దేవేంద్రరూపుడు. 840

సర్వదేవమయః — సర్వదేవమయుడు. 841

గురుః - గురుస్వరూపుడు. 842

శ్లో॥ సహస్రబాహు స్సర్వాంగః । శరణ్యః సర్వ
లోకకృత్
పవిత్రం త్రికకున్మన్త్రః । కనిష్ఠః కృష్ణపింగళః

సహస్రబాహుః - అనేక బాహువులు కలవాడు. 843

సర్వాంగః — సర్వమును పొందువాడు. 844

శరణ్యః - శరణుపొంద దగువాడు. 845

సర్వలోకకృత్ - సకలలోక నిర్మాత. 846

పవిత్రం — పుణ్యతీర్థాది రూపమున పవిత్రమైనవాడు. 847

త్రికకున్మంత్రః - బీజశక్తి కీలకముల నెడి యున్నత స్థాన
ములుకలమంత్రమైనవాడు. 848

కనిష్ఠః - అదితిపుత్త్రులలో చివరివాడు (వామనుడు) 849
కృష్ణపింగళః - హరిహరమూర్తి 850

శ్లో॥ బ్రహదర్కావినిర్మాతా । శతఘ్నిపాశ శక్తిమాన్
పద్మగర్భో మహాగర్భో । బ్రహ్మగర్భో
జలోద్భవః 103

బ్రహ్మదర్కావినిర్మాతా - బ్రహ్మదండమును నిర్మించి
నవాడు. 851
శతఘ్నీపాశ శక్తిమాన్ - శతఘ్నీపాశము శక్తికల
వాడు. 852
పద్మగర్భః - బ్రహ్మ 853
మహాగర్భః - గొప్పగర్భము (అంతరవకాశము) కల
వాడు. 854
వేదగర్భః - వేదగర్భితుడు. 855
జలోద్భవః - జలమయమైనప్పుడవతరించు మాయావి 856

శ్లో॥ గభస్తిఃబ్రహ్మకృత్ బ్రహ్మీ । బ్రహ్మవిత్
బ్రాహ్మణోగతిః
అనన్తరూపోనైకాత్మా । తిగ్మతేజః స్వయంభువః

గభిస్తిః - కిరణములు కలవాడు. 857
బ్రహ్మకృత్ - వేదకర్తా. 858
బ్రహ్మీ - వేదధ్యాయి. 859
బ్రహ్మవిత్ - వేదార్థమెరిగినవాడు. 860

బ్రాహ్మణః - బ్రహ్మిష్ఠుడు. 861

గతిః - బ్రహ్మిష్ఠులకు గతియైనవాడు. 862

అనన్తరూపః - అనన్తమైన రూపము కలవాడు. 863

నైకాత్మా - అనేక శరీరములను దాల్చినవాడు. 864

తిగ్మతేజః స్వయంభువః - బ్రహ్మదృష్టిలో తీవ్రమైన తేజస్సు కలవాడు. 865

శ్లో॥ ఊర్ధ్వగాత్మా పశుపతి। ర్వాతరంహో మనోజవః
చన్దనీపద్మనాళాగ్రః। సురభ్యుత్తరణో నరః 105

ఊర్ధ్వగాత్మా - దేశకాలవస్తువులనెడి ఉపాధిత్రయమును మించిన స్వరూపము కలవాడు. 866

పశుపతిః - జీవులకు ప్రభువు. 867

వాతరంహః - వాయుసమవేగము కలవాడు. 868

మనోజవః - మనసుతో సమానమైన వేగము కలవాడు. 869

చన్దనీ - చన్దనము పూసికొన్న దేహము కలవాడు. 870

పద్మనాలాగ్రః - పద్మనాళము చివర కలవాడు. 871

సురభ్యుత్తరణః - కామధేనువును ఉన్నత స్థానమునుండి క్రిందకి దింపినవాడు. 872

నరః - శివుని ఆద్యంతములను గ్రహింపజాలని బ్రహ్మవిష్ణువుల స్వరూపము కలవాడు. 873

శ్లో॥ కర్ణికార మహాస్రగీ। నీల మౌలిః పినాకధృత్
ఉమాపతి రుమాకాన్తో। జాహ్నవీధృదుమాధవః

కర్ణికారమహాస్రగ్వీ - కర్ణికారపుష్పమయమైన గొప్ప దండ కలవాడు. 874

నీలమౌలిః - నీలమణిమయమైన కిరీటము శిరమున కలవాడు 875

పినాకధృత్ — పినాకమను విల్లు దాల్చినవాడు. 876

ఉమాపతిః — బ్రహ్మ విద్య కధిపతి. 877

ఉమాకాన్తః - బ్రహ్మవిద్యచేత కామింపబడినవాడు. 878

జాహ్నవీధృత్ - గంగను దాల్చినవాడు. 879

ఉమాధవః - పార్వతీభర్త. 880

శ్లో॥ వరోవరాహో వరదో । వరేణ్యః సుమహాస్వనః
మహాప్రసాదో దమనః । శత్రుహా శ్వేతపింగళః

వరోవరాహః - భూమినుద్ధరించిన యజ్ఞవరాహము. 881

వరదః - అనేకావతారములతో ప్రజలను పాలించువాడు. 882

వరేణ్యః - ప్రభువుగా కోరదగువాడు. 883

సుమహాస్వనః - వేదగర్భితుడగు హయగ్రీవుడు. 884

మహాప్రసాదః — భక్తులపై గొప్ప అనుగ్రహము చూపువాడు. 885

దమనః — దమనముచే పూజింపబడువాడు, లేక, దుష్టుల నణచువాడు. 886

శత్రుహా - కామాది శత్రువులను హరించువాడు. 887

శ్వేతపింగళః - అర్థనారీశ్వరుడు దక్షిణ భాగము కర్పూర గౌరవర్ణము వామభాగము కనకపింగళవర్ణము 888

శ్లో॥ పీతాత్మా పరమాత్మాచ । ప్రయతాత్మా
ప్రధానధృత్
సర్వపార్శ్వముఖ స్త్ర్యక్షో । ధర్మసాధారణోవరః

పీతాత్మా — పసిడి ఛాయ కలవాడు. 889

పరమాత్మా - అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయమైన పంచాత్మలపైన ఆరవదగు ఆనంద మాత్ర స్వరూపుడు. 890

ప్రయతాత్మా - చిత్త శుద్ధ చిత్తుడు. 891

ప్రధానధృత్ - త్రిగుణాత్మకమైన జగత్కారణమైన ప్రధానాఖ్యము కల అజ్ఞానమున కధిష్ఠానములు కలవాడు. 892

సర్వపార్శ్వముఖః - నాలుగు దిక్కులందు ఊర్ధ్వము నందు మొత్తము అయిదు ముఖములు కలవాడు. 893

త్ర్యక్షః — సూర్యచంద్రాగ్ని నేత్రుడు. 894

ధర్మసాధారణోవరః — పుణ్యాను రూపమైన అనుగ్రహ స్వరూపుడు. 895

శ్లో॥ చరాచరాత్మా సూక్ష్మాత్మా ।అమృతోగోవృషేశ్వరః
సాధ్యర్షి ర్వసురాదిత్యో । వివస్వా న్సవితామృతః

చరాచరాత్మా - చరాచరాత్ముడు అనగా కర్మాను రూప ప్రసాదాను రూప మార్గము కలవాడు. 896

సూక్ష్మాత్మా - కర్మమార్గ ప్రసాద మార్గములు రెండింటికి గోచరింపనివాడు. 897

అమృతోగో వృషేశ్వరః - నిష్కామధర్మమునకు
మోక్షరూపమైన ఫలమునిచ్చువాడు. 898

సాధ్యర్షిః - దేవతలకు సాధ్యులకాచార్యుడు. 899

వసురాదిత్యః — అదితి పుత్రుడగు వసువు యొక్క
రూపముకలవాడు. 900

వివస్వాన్ సవితామృతః - కిరణములతో సుశోభితమైన
జగత్తును తృప్తము చేయు అమృత స్వరూపుడైన
సూర్యుడు. 901

శ్లో॥ వ్యాసస్సర్గస్సుసంక్షేపో విస్తరః । పర్యయోనరః,
ఋతు స్సంవత్సరో మాసః । పక్షస్సంఖ్యాస
మాపనః 110

వ్యాసః - పురాణేతిహాసకర్త. 902

సర్గః సుసంక్షేపో విస్తారః - వ్యాస విరచితమైన పురాణా
దులు సూత్రరూపమున సంగ్రహము భాష్య రూప
మున విస్తారము కలవాడు. 903

పర్యయోనరః - అంతట వ్యాపించిన వైశ్వానర రూపు
డగు జీవుడు. 904

ఋతుః — ఋతు స్వరూపుడు. 905

సంవత్సరః - సంవత్సర స్వరూపుడు. 906

మాసః - మాస స్వరూపుడు. 907

పక్షః - పక్షస్వరూపుడు. 908

సంఖ్యాసమాపనః – సంక్రాంతి దర్శ (అమావాస్య) పౌర్ణమాసి మున్నగు వాని స్వరూపము కలవాడు. 909

శ్లో॥ కలాకాష్ఠాలవా మాత్రా । ముహూర్తాహః
క్షపాః క్షణాః
విశ్వక్షేత్రం ప్రజాబీజం । లింగమాద్యస్తు
నిర్గమః 111

కాలాః - కాల భాగమైనవాడు. 910
కాష్ఠా – కాల భాగమైనవాడు, 911
లవాః - కాల భాగమైనవాడు. 912
మాత్రా - కాల భాగమైనవాడు. 913
ముహూర్తాహఃక్షపా - ముహూర్తదిన రాత్రి రూపుడు. 914
క్షణాః - క్షణరూపుడు. 915
విశ్వక్షేత్రం - బ్రహ్మాండ వృక్షమున కాలవాలము. 916
ప్రజాబీజం - ప్రజలకు బీజము వంటివాడు. 917
లింగం - మహత్తత్వము. 918
ఆద్యోనిర్గమః – అంకురరూపమైనవాడు. 919

శ్లో॥ సదసద్వ్యక్త మవ్యక్తం । పితామాతాపితామహః
స్వర్గ ద్వారం ప్రజాద్వారం । మోక్షద్వారం
త్రివిష్టపం 112

సత్ - కార్యము. 920
అసత్ – కారణము. 921

వ్యక్తం — ఇంద్రియ గ్రాహ్యము. 922
అవ్యక్తః — అనుభవైక వేద్యమైన అజ్ఞానము. 923
పితా — తండ్రి. 924
మాతా - తల్లి 925
పితామహః — తాతలేక బ్రహ్మ. 926
స్వర్గద్వారం — తపము. 927
ప్రజాద్వారం — రాగము. 928
మోక్షద్వారం - వైరాగ్యము. 929
త్రివిష్టపం — స్వర్గసాధన ధర్మము. 930

శ్లో॥ నిర్వాణం హ్లాదనశ్చైవ । బ్రహ్మలోకః పరాగ
దేవాసుర వినిర్మాతా । దేవాసుర పరాయణః 116

నిర్వాణం — మోక్షము 931
హ్లాదనః — ఆనందపరచువాడు. 932
బ్రహ్మలోకః - సత్యలోకము అయినవాడు. 933
పరాగతిః — ఉత్కృష్టగతియైనవాడు 934
దేవాసుర వినిర్మాతా - దేవదానవులను సృష్టించినవాడు 935
దేవాసుర పరాయణః - దేవదానవులకు ఉత్కృష్టాశ్రయుడు. 936

శ్లో॥ దేవాసుర గురుర్దేవో । దేవసురనమస్కృతః
దేవాసుర మహామాత్రో । దేవాసురగణాశ్రయః

దేవాసురగురుః - బృహస్పతి శుక్రరూపుడు. 937
దేవః — జయేచ్ఛకలవాడు. 938
దేవాసురనమస్కృతః — దేవదానవుల చేత నమస్కరింప
బడువాడు. 939
దేవాసుర మహామాత్రః - దేవదానవ శ్రేష్ఠుడు. 940
దేవాసురగణాశ్రయః - దేవదానవగణముల చేత ఆశ్ర
యింపదగువాడు. 941

శ్లో॥ దేవాసురగణాధ్యక్షో । దేవాసురగణాగ్రణీః
దేవాతి దేవో దేవర్షి । ర్దేవాసుర వరప్రదః 115

దేవాసురగణాధ్యక్షః - ఇంద్రవిరోచనాది రూపుడు. 942
దేవాసురగణాగ్రణీః - కార్తికేయ కేశిదైత్యరూపుడు. 943
దేవాతి దేవః — ఇంద్రియముల నతిక్రమించి స్వయముగా
ప్రకాశించు వాడు. 944
దేవర్షిః - నారదాది రూపుడు. 945
దేవాసురవరప్రదః - బ్రహ్మరుద్రాది రూపమున దేవ
దానవులకు వరమొసంగువాడు. 946

శ్లో॥ దేవాసురేశ్వరో విశ్వో । దేవాసురమహేశ్వరః
సర్వదేవమయో చిన్త్యో । దేవతాత్మాత్మ సంభవః

దేవాసురేశ్వరః - దేవదానవులకు ప్రభువు. 947
విశ్వః - లోకగర్భుడు. 948
దేవాసుర మహేశ్వరః — దేవదానవుల కధిష్ఠానమైన
మహేశ్వరుడు. 949

సర్వదేవమయః - సర్వదేవతా స్వరూపుడు. 950
అచిన్త్యః – చింతింపదగువాడు తానుతక్క అన్యుడు లేనివాడు. 951
దేవతాత్మా - దేవతలకంతరాత్మ. 952
ఆత్మసంభవః - స్వయంభువుడు. 953

శ్లో॥ ఉద్భిత్త్రివిక్రమో వైద్యో । విరజో నీరజోఽమరః
ఈడ్యో హస్తీశ్వరో వ్యాఘ్రో । దేవసింహో నరర్షభః 11[?]

ఉద్భిత్ - భేదించుకొని యావిర్భవించువాడు ఫలము లేక ప్రాసరము లేక యజ్ఞాది రూపుడు. 95[?]
త్రివిక్రమః - మూడు భువనముల నాక్రమించువాడు. 955
వైద్యః - విద్యావంతుడు. 956
విరజః – నిర్మలుడు 957
నీరజః - రజోగుణ హీనుడు. 958
అమరః - నాశనము లేనివాడు 959
ఈడ్యః - స్తుత్యుడు. 960
హస్తీశ్వరః - కాళహస్తీశ్వరుడగు వాయులింగ రూపుడు. 961
వ్యాఘ్రః - పెద్దపులి 962
దేవసింహః - దేవతలలో పరాక్రమి 963
నరర్షభః - నరులలో శ్రేష్ఠుడు. 964

శ్లో॥ విబుధోఽగ్రవరః సూక్ష్మః । సర్వదేవ స్తపోమయః
సుయుక్త శ్శోభనోవజ్రీ । ప్రాసానాం ప్రభవోఽవ్యయః 118

విబుధః - మిగుల ప్రాజ్ఞుడు. 965
అగ్రవరః - యజ్ఞమున ముందుగా భాగమును కోరువాడు. 966
సూక్ష్మః - దుర్లక్ష్యుడు. 967
సర్వదేవః - సర్వదేవతా స్వరూపుడు 968
తపోమయః - తపస్సే ప్రధానముగా కలవాడు. 969
సుయుక్తః - మిగులసంసిద్ధుడు. 970
శోభనః - కల్యాణుడు. 971
వజ్రీ - వజ్రాయుధము కలవాడు. 972
ప్రాసానాం ప్రభవః - ప్రాసాద్యాయుధముల కుత్పత్తి స్థానము. 973
అవ్యయః - ఏకాగ్ర చిత్తముతో పొందదగువాడు. 974

శ్లో॥ గుహః కాన్తో నిజస్సర్గః । పవిత్రం సర్వపావనః
శృంగీ శృంగప్రియోబభ్రూ।రాజరాజో నిరామయః

గుహః - కుమార స్వామి 975
కాన్తః - ఆనందమునకు పరాకాష్ఠ. 976
నిజస్సర్గః - తనకంటె అన్యుడు లేనివాడు. 977
పవిత్రం - మృత్యుదుఃఖమునుండి కాపాడువాడు. 978
సర్వపావనః - బ్రహ్మాదులను కూడ శుద్ధి చేయువాడు. 979

శృంగీ - వృషభాది రూపుడు. 980
శృంగప్రియః — పర్వత శిఖరాశ్రయుడు. 981
బభ్రుః - శనైశ్చరుడు. 982
రాజరాజః - కుబేరుడు. 983
నిరామయః - నిర్దోషుడు 984

శ్లో॥ అభిరామ స్సురగణో । విరామస్సర్వసాధనః
లలాటాక్షో విశ్వదేవో । హరిణో బ్రహ్మవర్చసః

అభిరామః — ప్రీతి జనకుడు. 985
సురగణః - దేవసంఘ రూపుడు 986
విరామః - విశ్రాంతి రూపుడు. 98'
సర్వసాధనః — సమస్తమైన ఆశ్రమ కర్మలు తనను చేరు సాధనమైనవాడు 988
లలాటాక్షః - నుదుట కన్ను కలవాడు. 989
విశ్వదేవః - బ్రహ్మాండములనెడి బంతులతో ఆడువాడు 990
హరిణః — మృగరూపుడు. 991
బ్రహ్మవర్చసః - విద్యాతపస్సముద్భవమైన తేజము కలవాడు. 992

శ్లో॥ స్థావరాణాం పతిశ్చైవ । నియమేన్ద్రియవర్ధన
సిద్ధార్థస్సిద్ధభూతార్థో । చిన్త్యః సత్యవ్రతశ్శుచిః

స్థావరాణాంపతిః - హిమాలయాది రూపుడు. 993
నియమేంద్రియ వర్ధనః - నియమము లతో ఇంద్రియము లను హింసిచువాడు. 994

